

స్వార్థం జీర్ణించి, జాతి గొప్పల
వ్యత్యాసాలతో కుళ్ళిపోతున్న
నేటి ప్రపంచానికి
సర్వమానవ సమానత్వం
చాటు



వినోదా వారి
శాంతి
చంద్రకుమారి.... సావిత్రి....సి. హేమలత
డా. గోవిందరాజుల సుబ్బారావు... రామచంద్ర కాశ్యప
ఆరణి... పేకేటి శివరాం...
కథ కొవ్వలి... పాటలు సముద్రాల జూ... సంగీతం సుబ్బురామన్... ఛాయ రంగా... కళ వాలి & గోడ్గాంకర్
దర్శకత్వం.. వేదాంతం రాఘవయ్య
పూర్ణా రిలీజ్
నిర్మాతలు... వినోదా పిక్చర్సు.. మద్రాసు. 17.
MATA







డిస్ట్రిబ్యూటర్లు

| | | | | |
|---|---|---|---|---|
| ఆంధ్రా | : | గోకుల్ కృష్ణా | .... | విజయవాడ. |
| నైజామ్ | : | ప్రీమియర్ | .... | సికింద్రాబాద్. |
| సీడెడ్ | : | శాంతి | .... | గుంటకల్. |
| మైసూరు | : | జయంత్ | .... | బెంగళూరు. |

తీవరలో విడుదల!

భరణీ వారి

# ప్రేమ

డైరెక్టర్
రామకృష్ణ











Love
(TELUGU)

భానుమతి
నాగేశ్వరరావు

ముక్కామల...సి.యస్.ఆర్...రేలంగి...శివరావు
శ్రీరంజని ...సూర్యకాంతం...సురభి కమలాబాయి
సీతారాం...దొరస్వామి...సుబ్బారావు....

స్టూడియో
వాహిని



ఫొటోగ్రఫీ కమాల్ ఘోష్ • మ్యూజిక్ సుబ్బరామన్ • పాటలు మాటలు శర్మ • కె. నాగేశ్వరరావు

ఆంధ్ర, సిడెడ్, నైజాములకు
పూర్ణా పిక్చర్సు లిమిటెడ్, విజయవాడ

మైసూర్ సంస్థానం, కూర్గులకు
డ్రీంలాండ్ పిక్చర్సు కార్పొరేషన్, బెంగుళూరు సిటీ

వివరములకు: భరణీ పిక్చర్సు, మదరాసు - 17.

# చందమామ

సంచాలకుడు: చక్రపాణి



సంపుటి 10 : సంచిక 2

ఫిబ్రవరి 1952

చందమామ కార్యాలయం కొత్త భవనాలలో ప్రవేశించిన శుభవార్తను అందుకొంటూ మా అభిమానులు, పాఠకులు, ప్రతినిధులూ ఆనందము తెలిపే అభినందన లేఖలు రోజూ కురిపిస్తున్నారు. ఇందుకు కృతజ్ఞులం. ఐతే, కొంతమంది జాబులను యింకా పాత చిరునామాకే వ్రాస్తుండటంవల్ల అవి మాకు చేరటంలో అనవసరమైన జాగునకు కారణమవుతున్నది. ముఖ్యమైన ఈవిషయం గమనించి, ఇటుపైన, 'చందమామ' కార్యాలయం, కోడంబాకం, మద్రాసు - 24 అనే చిరునామాకే ఉత్తరాలు వ్రాయవలసిందని మళ్లీ కోరుతున్నాము. ఈ సందర్భంలో మా రచయితలకుకూడ ప్రత్యేకించి ఒక్క మాట చెప్పవలసివున్నది: ముక్కాసీబిళ్ల వేసి బుక్-పోస్టులోపంపే రచనలతో ఎటువంటి జాబులూ ఉండకూడదు. తపాలా శాఖవారు ఇటువంటి కవర్లు పరీక్షించి, 'ఇందులో జాబువున్నది - కనుక చార్జి చేస్తున్నాము' అని ముద్రవేసి ఉత్తరాల రేటుప్రకారం అదనపు సొమ్ము వసూలు చేస్తారు. అటువంటప్పుడు కవర్లు రచయితలకు తిరిగివచ్చేపరిస్థితి ఏర్పడుతూ వుంటుంది. కనుక,-ఇది అందరకూ తెలిసిన చిన్నవిషయమే ఐనప్పటికీ,- చిక్కులురాకుండ శ్రద్ధవహించటం మంచిదని మా రచయితలకు సలహా యిస్తున్నాము.





# పుణ్యమెవరిది?

పాతరోజుల రాజు ఒక్కడు
జాతికంతకు ఖ్యాతి తేగల
దేవళం కట్టించవలెనని
పూనుకున్నాడు.

రాజుదలచిన కొదవ ఏమిటి ?
మోజుమీర వ్యయప్రయాసలు
లెక్కచేయుక చక్కగా గుడి
పూర్తిచేశాడు.

నిక్కముగ ఇటువంటి మందిర
మెక్కడుందని జనులు పొగడగ
చక్కగా తన పేరు ద్వారం
పైన కూర్చాడు.

ఉత్సవాలూ, సంబరాలూ
పచ్చపచ్చగ పెచ్చుమీరగ
హెచ్చు అలసటచేత భూపతి
నిద్దరోయాడు.

నిదురలో కల ఒకటి కన్నా
డెదురుగా తనమందిరం అది
కాని ద్వారంపైన పేరొక
ఆడుదానిదిగా !

రచన:
'బైరాగి'

రాజు అచ్చెరువొంది రెండవ రోజు భటులను 'రాజ్యమంతా వెదకి ఆవిడ ఎక్కడుందో తెండి' అన్నాడు.

భటులు కాటికి కాళ్ళుజాచిన కటిక ముదుసలి పేదరాలిని ఒక్కతెను ఆ రాజుముందుకు తోడితెచ్చారు.

'మందిరం కట్టటానికి నీ వందచేసిన సాయమేమిటి? ఎందుకో నీపేరు ఉం'దని రాజు అడిగాడు.

'మందిరానికి రాళ్ళుమోస్తూ క్రమందికుందిన ఎద్దులకు నే మేతవేసిన మాట నిజ'మని అవ్వపలికింది.

'కీర్తికై నే పాటుబడితే ఆర్తిబాపినదామె' అని ఆ రాజు ముదుసలిఆమెపేరే చెక్కమన్నాడు.





# తెలివితక్కువ దద్దమ్మ

సింగారపురంలో సుక్కు, రుక్కు అని ఇద్దరు దొంగలు ఉండేవాళ్ళు. సుక్కు చాలా తెలివైనవాడు. వాడు తనకు చేతనైన విద్యలు అన్నీ రుక్కుకు నేర్పాడు. రుక్కు విద్యలైతే నేర్చాడు గాని, వాటిని సమయం తెలిసి ప్రయోగించే నేర్పు లేదు. అందుకని సుక్కు వాడితో "అబ్బాయీ!—నీఅంతట నీవు స్వతంత్రించి ఏపనీ చేయబోక. నేనేమి చేస్తానో కనిపెట్టి చూస్తూవుండు. అలానే నువ్వు చేస్తూవుండు' అని చెప్పాడు. సరేనని ఒప్పుకొన్నాడు రుక్కు.

ఒకరోజున వాళ్ళు, లక్షాధికారి అయినటువంటి సుబ్బిశెట్టి ఇంట్లో కన్నం వేయటానికని వెళ్ళారు.

సుక్కు కన్నం వేశాడు. వాడూ రుక్కూ కలిసి సడీ చప్పుడూ చేయకుండా లోపలికి దూరారు. మెల్లిగా ధనాగారంలోకి ప్రవేశించారు.

సుక్కు ధనద్రవ్యాలూ, వస్తువాహనాలూ ఉండే పెద్దపెట్టె తెరిచాడు. ధనం కాజేస్తూ ఉండగా పొరపాటున చెయ్యితగిలి పెట్టెమూత దభీమనిపడి చప్పుడయింది. ఆ చప్పుడుకు సుబ్బిశెట్టికి మెలకువ వచ్చింది. పడుకొని ఉండే 'ఎవడురా అక్కడ !!'—అని కేక వేశాడు. ఆ వెంటనే సుక్కు 'మ్యావ్! మ్యావ్!!' అని కూశాడు. 'సరే పిల్లి కాబోలు చప్పుడు చేసింది' అని అనుకొని సుబ్బిశెట్టి అటుపక్కకు తిరిగి మళ్ళీ పడుకున్నాడు.

ఈసారి రుక్కు అక్కడకు వెళ్ళి పెట్లె తీయబోయాడు. దురదృష్టవశాత్తు అది వాడి కాలుకు తగిలి బోర్లాపడ్డాడు. పెద్దగా చప్పుడయింది. శెట్టి లేచాడు. 'ఎవడురా అక్కడ !!'—అని కేకలేస్తూ ఆ గదిలోకి వచ్చాడు.

శెట్టిని చూచి రుక్కు కంగారు పడ్డాడు. వణికిపోతూ చేతులుకట్టుకొని 'నేను రెండోపిల్లినండి, క్షమించండి. బాబూ! ఏమీ అనకండి' అని బతిమాలసాగాడు.

అప్పుడు శెట్టి గదిలో దూరిన రెండు పిల్లుల్నీ పట్టీ కట్టీ కొట్టి వదిలాడు.



ఒకానొకప్పుడు ఘూర్జరదేశాన్ని ఉగ్రసేనుడనే రాజు పరిపాలించాడు. అతడు తనకు ఉన్న రాజ్యంతో తృప్తిపడక, చుట్టుప్రక్కల వున్న రాజ్యాలపైకి దండయాత్రచేసి వాటి నన్నింటినీ తన రాజ్యంలో చేర్చుకుని 'చక్రవర్తి' అని అందరిచేతా పిలిపించుకునేవాడు. తన అధీనంలోకి వచ్చిన రాజ్యాలలోని ప్రజల్ని అనేకవిధాలుగా హింసించి, 'పరమ దుర్మార్గుడు' అన్న పేరు సంపాదించాడు. అక్కడితో ఊరుకోక, ప్రతీ పట్టణంలోనూ పొడుగాటి గెడ ఒకటి పాతించి, ఆ గెడ కొసను తనపేరు చెక్కిన కిరీటం ఒకటి తగిలించి, వచ్చేపోయే వాళ్లందరూ ఆ కిరీటానికి నమస్కారంచేసి మరీ వెళ్ళాలని దండోరా వేయించాడు.

అంతవరకూ స్వతంత్రంగా జీవిస్తూన్న ప్రజలందరికీ ఇది చాలా అవమానకరంగా తోచింది. కాని విధిలేక, అటు వెళ్లవలసి నప్పుడల్లా ఆ కిరీటానికి ఒకదణ్ణంపెట్టి మరీ పోతూండేవారు.

అకాలంలోనే, వింధ్యారణ్యంలో గండా అనే భిల్లుడొకడు వుండేవాడు. అతడు ఏకలవ్యుణ్ణి మించిన విలుకాడు. అతడు బాణంవేస్తే గురితప్పడం అనేదిలేదు. అతడొకనాడు తన పదేళ్ల కొడుకుని వెంటబెట్టుకుని సమీపంలోని ఒక పట్టణానికి వెళ్లేడు.

అక్కడ బజారులో గెడకొసని ఒక కిరీటం తగిలించివుండటం, ఆ కిరీటానికి వచ్చేపోయేవాళ్లంతా వంగి దణ్ణంపెట్టి పోతుండటం చూశాడు. సంగతి తెలుసుకున్నాడు. తనుమాత్రం దణ్ణంపెట్టకుండా ఠీవిగా నడిచి వెళ్ళిపోయాడు.

కాని పదిఅడుగులు వేశాడోలేదో, గెడవద్ద కాపలా కాస్తూవున్న జవానులు వచ్చేసి గండాభిల్లుణ్ణీ, కుమారుణ్ణీ పట్టి తీసుకుపోయి చక్రవర్తి సమక్షంలో నిలబెట్టేరు.

జి. లక్ష్మణసింగు - నాగపూర్



"ఎవరయ్యా నువ్వు? ఆ త్రిమూర్తులు కూడా నా అజ్ఞ ధిక్కరించటానికి వీల్లేదు కదా? నీవేమో ఎదురెత్తుగా ప్రవర్తిస్తున్నావటే?" అని అడిగేడు చక్రవర్తి.

"నాపేరు గండాభిల్లుడు. అడవిలో సింహానికిమల్లే విచ్చలవిడిగా తిరిగే నాకు, ఒకానొక రాజు కిరీటానికి జోహారు చెయ్యవలసిన అవసరమేమున్నది?" అని ఎదురు ప్రశ్న వేశాడు గండాభిల్లుడు.

"ఓహో, నువ్వేనా గండాభిల్లుడివి? నీ గురి ఎన్నడూ తప్పదని విన్నాను. ఏదీ నీ సామర్థ్యం నాకొకమాటు ప్రదర్శించి చూపు" అంటూ చక్రవర్తి, ప్రక్కనున్న వాళ్లతో, "జామిపండు ఒకటి తీసుకు రండోయ్" అన్నాడు.

పండు తేవటంతోనే, "గండాభిల్లు ప్రక్కనున్న వాడికొడుకును తీసుకుపోయి ఎదురుగా అచెట్టుకు కట్టెయ్యండి. కట్టి, అ జామిపండు కుర్రవాడి నెత్తిమీద నిలబెట్టండి" అన్నాడు రాజు.

అలా చేయటంతోనే ఉగ్రసేనుడు గండాభిల్లుడితో, "నీ కుమారుని నెత్తిపైనవున్న అ జామిపండును గురిచూసి బాణంతో కొట్టాలి. లక్ష్యంతప్పకుండా కొట్టగలిగితివా నీవుచేసిన అపరాధాన్ని క్షమించి నిన్నూ పిల్లవాణ్ణికూడా వదిలేస్తాను ..." అన్నాడు.

అమాటలు వినటంతోనే గండాభిల్లుడి గుండె ఝల్లుమంది! వొళ్లంతా చెమటలు పోసినై. కోపంతో పళ్లు పటపటకొరుకుతూ-"రాజా, ఎంత క్రూరుడవు నువ్వు? కాస్త గురితప్పి నాబాణం క్రిందకుపోయిందంటే, చేతులారా నా కుమారుని ప్రాణాలు తీసుకున్నవాడినవుతానే! నా ప్రాణాలుపోయినా సరే నేను ఇందుకు వొప్పుకోను!" అన్నాడు.

రాజు వెకిలిగా నవ్వుతూ, "నా అజ్ఞ నెరవేర్చకుంటివా, నీకు మరణశిక్ష ఎలాగూ తప్పదు. ఐతే, నీ కళ్ళఎదట నీ కుమా

రుని చంపించిన తరువాతనే అపని. తెలిసిందా!" అన్నాడు.

నిశ్చేష్టుడయ్యాడు గండాభిల్లుడు.

అతనిని చూచి కుమారుడు "నాయనా, భయమెందుకు? నీగురి ఎన్నడూ తప్పదు. బాణంవదులు!" అన్నాడు.

ఆ మాటకు "శెభాష్!" అని రాజే మెచ్చుకున్నాడు.

గండాభిల్లు తన అమ్ములపొదిలోనుండి పదునైనబాణం ఒకటి తీశాడు. దాని వాడి మొన వెండిరేకులా ధగధగ మెరుస్తూ కన్నులను మిరుమిట్లుగొలుపుతున్నది. పరీక్షించి, దాన్ని మొలలో దోపుకున్నాడు. పొదిలోంచి మరొక సామాన్యపు బాణాన్ని తీసి విల్లుకు తగిలించి, కుమారుని నెత్తిపై నిలిచివున్న జామిపండును గురిచూసి, బాణంవదిలేడు. అదివెళ్లి పండును ముక్కున కరుచుకుని ముందుకు వెళ్ళిపోయింది.

అదిచూసి ఉగ్రసేనుడు 'శెబాష్, శెబాష్' అంటూ చప్పట్లు చరిచాడు. తన కొలువులోని సొంత విలుకాళ్లవైపు 'ఎందుకూ, మీరూ వున్నారు' అన్నట్టుగా చూశాడు.

అలాగ రాజు హేళనచెయ్యటం వాళ్లందరికీ చాలా అవమానకర మనిపించింది.



'దేశాభిమానం వదులుకుని పొట్టకోసం వీడి కొలువులో చేరినందుకు ఉత్తపుణ్యాన్ని ఇలా అవమానంచేస్తాడా?' అనుకున్నారు వాళ్లంతా.

మాటప్రకారం, చక్రవర్తి గండాభిల్లు కొడుకు కట్లువిప్పించి, వాళ్ళిద్దర్నీ యథేచ్ఛగా వెళ్లిపోవచ్చు నన్నాడు.

గండాభిల్లు వెళ్ళిపోయేటప్పుడైనా చక్రవర్తికి నమస్కారంచెయ్యటంకాని, సెలవు తీసుకోడంగాని చెయ్యలేదు.

'ఎంతటెక్కూ వీడికి!' అనిపించింది చక్రవర్తికి. ఐతే యేం, ఏమీ అనలేకపోయాడు. గండాభిల్లుడు తనదారిని వెడుతోంటే అతని

మొలలోవున్న వాడిబాణంమొన తళుక్కు మని మెరిసి, చక్రవర్తి కంటపడింది.

'అబ్బే, ఆగు. ఇందాకనే అడుగుదా మనుకున్నాను. మొదటతీసిన ఆ బాణాన్ని పదును పరీక్షించి, వాడకుండా మొలలో పెట్టేశావు దేనికి?' అని అడిగాడు రాజు.

గండాభిల్లుడు, 'దేనికా? ఒకవేళ నా బాణం గురితప్పి నా కుమారుని ప్రాణం పోవటమే జరిగిననాడు ఈ వాడిబాణం నీ గుండెలో దూసుకుపోయి వుండేది!' అని నదురూ బెదురూ లేకుండా చెప్పేడు.

ఉగ్రసేనుడు ఉగ్రుడైలేచి, 'ఏమన్నావు? నాప్రాణాలు తీస్తావా?' అంటూ తన విలు కాళ్లవైపు తిరిగి, 'చూస్తారేం, రాజద్రోహిని చూస్తూ' అన్నాడు.

ఆవాక్యం పూర్తికాకుండానే గండాభిల్లు తన మొలలోని బాణాన్ని తీసి సంధించి, చక్రవర్తి రొమ్మును గురిచూసి కొట్టేడు.

'అమ్మోయ్!' అంటూ చక్రవర్తి గొడ్డలి పెట్టుగా ఒరిగిపోయాడు.

అప్పుడు రాజభటులు 'పట్టుకోండి! పట్టుకోండి!!' అంటూ గండాభిల్లువైపు పరుగెత్తేరు.

కాని, అక్కడి జనం వాళ్లను అడ్డు తగిలి, 'ఒక్కఅడుగు ముందుకువేశారంటే ప్రాణాలు తక్కవుసుమా జాగర్త!!!' అన్నారు. దానితో వాళ్లు పలాయనం చిత్తగించారు.

'ఈ లోకకంటకుణ్ణి వధించి, మాకు పీడ వదిలించావు మహానుభావా!' అని ప్రజలంతా గండాభిల్లుణ్ణి అనేకవిధాల పొగిడి, అంతవరకూ ఉగ్రసేనుడి కిరీటానికి తప్పనిసరిగా జోహరు చెయ్యవలసివచ్చిన వాళ్లంతా గండాభిల్లుకి హృదయ పూర్వకంగా, భక్తిగౌరవాలతో నమస్కారం చేశారు.






## 2

ప్రజలంతా గంట స్తంభం దగ్గరకు పరుగు లెత్తి గంటలు లెక్కస్తున్నారని చెప్పాం కదా? అయితే, యింతలో రాణి చనిపోయి నట్లు గంట స్తంభానికి కబురు ఎలావెళ్లింది? నిజానికి, రాణి చనిపోయినట్లు ఒక్క వృద్ధు రాలికితప్ప మరో పురుగుకి తెలియదే. అంతే కాదు. గంట స్తంభంవద్ద కాపలావాడితోసహా అందరూ దర్బారులోనే వున్నారాయె!

ఎప్పుడైతే గంట చెవినిపడిందో, గంట స్తంభం కాచే కాపలావాడుకూడా నివ్వెర పోయాడు. ఎవరో ఆటగోటితనానికి గంట మ్రోగిస్తూవుండివుండాలి. ఒక్క క్షణం ఆలస్యంజరిగినా రాజ్యమంతా అల్లకల్లోలం అయిపోతుంది. అందుచేత ఒక్కపరుగున వెళ్ళి గంటస్తంభం చేరుకొన్నాడు. చూడగా గంటలు కొడుతున్నది ఒక వృద్ధురాలు! అయితే అప్పటికప్పుడే ఆమె ముప్పైతొమ్మిది గంటలూ కొట్టటమూ, ప్రజలంతా అక్కడికి చేరిపోవటమూకూడా జరిగింది. ఇలాంటి దారుణానికి ఒడిగట్టిన ఆ వృద్ధురాలిని అమాంతంపట్టి చీల్చివెయ్యాలనే తలంపుతో ఆమెని పట్టుకోబోయాడు. కాని వృద్ధురాలు అదృశ్యరూపం పొంది ఎగిరి చక్కాపోయింది.

కాపలావాడు గజగజ వణకిపోయాడు. రాణి చనిపోయిందా ? ఎలానమ్మటం ? ఈ వార్త ప్రజలలో పాకిపోకముందే నిజమో అబద్ధమో తను తెలుసుకోవాలి. అక్కడ చేరిన గుంపును నెట్టుకొని ఒక్కపరుగున అంతఃపురంలో చొరబడ్డాడు. రాణీ శయ్యా గృహం ప్రవేశించాడు. రాణీ చిరనిద్రలో



వుండటంచూచి నివ్వెరపోయాడు. జలజల కన్నీరుకారుస్తూ, బరువుగా అడుగులు వేసుకొంటూ గదిలోంచి బయటకువచ్చేశాడు.

అప్పటికే గంటస్తంభంనుంచి మరలి అంతా తిరిగి అంతఃపురానికి చేరుకున్నారు. రాణీ శయ్యాగృహంలోంచి దుఃఖసముద్రంలో మునిగివస్తున్న కాపలావాడినిచూచి అంతా వారికి తెల్లమైపోయింది. అంతఃపురమంతా "రాణీ,...రాణీ" అనే కేకలతో మారుమ్రోగిపోతున్నది!!

ఇక అక్కడ రాజుపరిస్థితి ఎలావున్నదంటే—ఎప్పుడైతే మరణగంట చెవిని పడిందో అప్పుడే గుండెదడ పట్టుకున్నది. ఒక్కొక్కగంట కొట్టినప్పుడల్లా, తన గుండెమీద సుత్తిదెబ్బ కొట్టినట్టే అనిపించింది. ముప్పైతొమ్మిదోగంట చెవిని పడీపడటంతోటే, రాజు కూర్చున్నవాడు కూర్చున్నట్టే సొలిపోయాడు. ఐతే చూడవచ్చిన రాజులు తప్ప, రాజపరివారంలో ఒక్కరూ అక్కడ లేరు. వాళ్ళు రాజుసంగతి మరిచిపోయి, గంటస్తంభంవైపుకి పరుగులెత్తారు.

తీరా యిప్పుడు అంతా తెలిసివచ్చిన తర్వాతగాని ఎవరికీ రాజుసంగతి స్ఫురణకు రాలేదు. "అయ్యో! అంతా యిక్కడనే వున్నామే. బావ ఏమయ్యాడో" అంటూ కంగారుపడ్డాడు శక్తిసింహుడు.

"అవును. ఇది మహాకలవర సమయం. బావగారు దర్బారులోనే వుండివుండాలి. మీరువెళ్ళి వారిసంగతిచూడండి. క్షణంలో నేనూ వచ్చేస్తున్నా" అన్నాడు మంత్రి.

శక్తిసింహుడు బయలుదేరాడు. అతని వెనుకనే తక్కిన పరివారం కదిలారు. వాళ్లతోపాటు అస్థానవైద్యుడూ, దాదీకూడా పోబోయారు. మంత్రి వాళ్ళనిద్దరినీ చూచి "ఆగండి" అని గద్దించాడు.

అస్థానవైద్యుడూ, దాదీ తెల్లబోయారు. "వీళ్ళనిద్దరినీ వేరువేరుగా బంధించి

వుంచండి" అని భటులకు ఆజ్ఞాపించాడు. భటులు వాళ్ళని తీసుకుపోయారు.

తక్షణమే మంత్రి, రాణి శయ్యాగారం తాళంవేయించి, దర్బారు చేరుకున్నాడు. మహారాజును అనేక విధాల ఓదార్చాడు. కాని, ఎంతచెప్పినా మహారాజుకు దుఃఖం ఆగలేదు: "మంత్రీ! రాణితోనే పోయింది నాబతుకు. లేకలేక పుట్టిన బిడ్డడిని కళ్ళారా చూచుకొనకుండానే కన్నుమూసింది రాణి. దిక్కుమాలిన దేశాచారం. తలకొక పేరూ రాసుకురావడమట. ఎవడు రాసినపేరులో ఏమి అపశ్రుతి పలికిందో, బిడ్డడికి తల్లి గండం పట్టుకుంది! నారాణి చచ్చి వూరుకుంది!!

"నాబిడ్డడికి ఎవ్వరూపేరుపెట్టవద్దు. దేశాచారంకాదు, దేవునిఆజ్ఞ అయినాసరే, ఉల్లంఘించి తీరుతాను. నా బిడ్డడికి నా రాణిపేరే పెట్టండి. నారాణి దేవప్రియ. నా బిడ్డకు దేవసింహుడు. ఏమి, మంత్రీ!—నామాట పాటిస్తావా?" అని వూరుకున్నాడు.

అందుకు మంత్రి "తప్పకుండా పాటిస్తాను, మహారాజా!—దేవసింహుడు... చక్కటిపేరు. మాతల్లిని స్మరించటంకంటే మాకు కావలసిన దేమిటి? ఈ పేరుపెట్టి



పిలవటానికి లోకమంతా సంతోషిస్తుంది" అనిచెప్పి రాజును వూరడించాడు.

ఇక్కడ మంత్రీ, రాజూ మాటాడుతూ వుండగా, శక్తిసింహుడు కోటలోకి వెళ్ళాడు. వెళ్ళేసరికి వృద్ధురాలి వింతవైనం, వైద్యుడ్నీ దాదినీ అదుపులో వుంచటం, శయ్యాగారం తాళంపడటం - ఈమొదలైన సందర్భాలన్నీ తెలిసివచ్చినై. తీవ్రంగా ఆలోచించాడు. దాదిని వుంచిన తావుకు వెళ్ళాడు.

"దాదీ!—కథ అడ్డంతిరిగింది. తలచిన ఉద్దేశాలన్నీ తారుమారయినై. నిన్నుపెద్దలు విచారణ చేయవచ్చు. నీవు దోషివని వారు తీర్మానించవచ్చు. నీకు మరణశిక్ష విధించ



వచ్చు. భయపడకు. నీప్రాణానికి నాప్రాణం అడ్డువేస్తా, నిజంమాత్రం వెల్లడించకు" అని ధైర్యం చెప్పాడు.

రాణికి ఉత్తరక్రియలు జరిగిపోయినై.

తర్వాత మరిరెండు రోజులకు మంత్రి ఆస్థానవైద్యుడినీ, దాదినీ దర్బారుకు రప్పించాడు. విచారణ చూడవచ్చినజనంతో దర్బారు కిటకిట లాడుతున్నది. మొట్ట మొదట మంత్రి ఆస్థానవైద్యుడిని విచారించాడు: అందుకు ఆస్థానవైద్యుడు—

"మంత్రిపుంగవా! కన్నతల్లివంటి దేవప్రియ విషయంలో యిలా జరిగిందంటే, చాలా విడ్డూరంగావున్నది. మీకంటే ఎక్కువగాశోకిస్తున్నానునేను. మీకంటె ఎక్కువగా ఆశ్చర్యపడుతున్నాను. కాని యిందులో ఏదో మోసం జరిగింది. ఇది ముమ్మాటికీ నిజం. దేవి మరణానికి, లోకానికి జవాబు చెప్ప వలసిన బాధ్యత మీకంటే నాకే ఎక్కువ. కనుక నిజం తెలుసుకోటానికి నా శాయ శక్తులా ప్రయత్నిస్తాను. ఇందుకుగాను ముందుగా మనం, ఒక్కపర్యాయం రాణి వారి శయ్యాగృహం పరిశీలించిరావటం అవసరం" అన్నాడు.

అదేప్రకారం వైద్యుడిని వెంటబెట్టుకొని మంత్రి, రాణిశయ్యాగృహం చేరుకున్నాడు. అప్పుడు వైద్యుడు అక్కడ బల్లమీదవున్న వస్తువులన్నీ ఒక్కొక్కటిగా పరిశీలించాడు. బల్లమీదనున్న పాలలోటా పడిపోయి పాలు ఒలికిపోయినై. అంతకుమినహా, మరొక ఆచూకీ ఏమీచిక్కిందికాదు. నిస్పృహచెంది బయటికి వస్తుండగా, వైద్యుడి దృష్టి అప్రయత్నంగా గదిలో ఒకమూలని పడివున్న ఒకవస్తువుపైన పడింది. దగ్గిరికివెళ్ళి చూడగా అది ఒక చచ్చిపడివున్న పిల్లి.

ఇది కంటపడగానే మంత్రీ, వైద్యుడూ ఒకరిముఖాలు ఒకరు చూచుకున్నారు. అప్పుడు వైద్యుడు ఒలికిపోయివున్న పాల



వంక చూపుతూ, "ఈ పాలు విషపూరిత మైనవని తోస్తుంది. నేను యిచ్చిన మందు ఆ పాలల్లో కలిపిపుచ్చుకొని వుంటుంది రాణి. ఐతే, పాలల్లో విషం ఎలా కలిసిందో! అది నిలకడమీదనే తెలియాలి" అన్నాడు.

"నిలకడమీద ఎలాగా తెలిసిపోతుందను కోండి. అయితే, బిడ్డడికిచ్చే పాలల్లో విషం కలిసిందీ అంటే, అది ఎలాజరిగిందో దాదికి తెలిసివుండాలి. కనుక మనం యిప్పుడే ఆమెనీ విచారించువాం" అంటూ వైద్యుడితోసహా మంత్రి దర్బారు చేరుకొన్నాడు. దాదిని విచారించాడు మంత్రి.

దాది: "స్వామీ!—ఆ లోటాలోఉన్నవి బిడ్డడిపాలు. నేనే అక్కడ పెట్టాను. పాలు పట్టుదామనుకునేటంతలో ఒక వృద్ధురాలు వచ్చింది. నన్ను బెదిరించింది. నేను హడిలిపోయి, ఈ మాట చెప్పటానికే ప్రభువుల వారివద్దకు పరుగెత్తుకువచ్చాను. అంతలోనే గంటలు వినబడినై. గంటలు కొట్టినదీ ఆ వృద్ధురాలేనని గంటలవాడు చెప్పనే చెప్పాడుకదా! ఆ దుర్మార్గురాలే పాలలో విషం కలిపివుంటుంది. ఇంకా నయం. కొంచెంసేపుంటే, తెలియక ఈ పాలు బిడ్డడికికూడా పట్టివుందును. బిడ్డడి ప్రాణానికి కూడా మోసం వచ్చివుండేది. ఈ బిడ్డడు ఎంతో అదృష్టవంతుడు. అందుకనే దేవుడు కాపాడాడు" అని చెప్పింది.

"ఎవరీ వృద్ధురాలు?—ఆమెది యే వూరు? ఏదేశం? ఆమెకు ఇక్కడ ఏమి పని? అసలు ఈ లోపలికి ఎలా ప్రవేశించింది? పాలలో విషం కలపడమేమిటి? ఎవరూ లేకుండాచూచి మరణగంటలు కొట్టడమేమిటి? ఇన్ని దుండగాలూచేసి పట్టుబడకుండా మాయం కావడమేమిటి?" ఈప్రశ్నలకు జవాబుతెలియక మంత్రీ, వైద్యుడూ ఆలోచనలో పడ్డారు. తక్కిన వాళ్లంతా తెల్లబోయి కూర్చున్నారు.



అప్పుడు మంత్రి భటులతో "ఆ వృద్ధురాలు మానవాతీతమయినదిగా కనబడుతున్నది. ఆమెకు ఈ కోటతో గట్టి సంబంధమున్నట్టు తోస్తున్నది. నిజానిజాలు తెలిసేవరకూ ఏమనుకోటానికీ వీలులేకుండా వున్నది. ఆమె రాకపోదు. మళ్ళీ కోటలోకి వస్తుంది. కనిపెట్టివుండండి" అని హెచ్చరికచేశాడు. ఆ వృద్ధురాలు వచ్చేవరకూ దాదినీ, వైద్యుణ్ణీ అదుపులో వుంచమన్నాడు.

* * * *

రోజులూ, నెలలూ గడిచిపోతున్నై. రాజభటులు యావన్మందీ మరొక వ్యాపకం లేకుండా వెయ్యికళ్లతో కనిపెట్టుకుని చూస్తున్నారు—వృద్ధురాలు తిరిగి ఎప్పుడు కంటబడుతుందా, ఎప్పుడు చీల్చిచెండాడుదామా అని. కాని ఎంతకూ వృద్ధురాలి జాడ ఏమీ తెలియరాలేదు. అందరూ నిస్పృహచెందారు. ఇక రాజుసంగతి చెప్పనే అక్కర్లేదు. రాణీ పోవటంతోటే మనః స్తిమితం తప్పింది. మంత్రీ, బావమరిదీ ఎంత ధైర్యం చెప్పినా ఫలితం ఏమీ కనుపించలేదు. క్రమంగా, ఆరోగ్యంకూడా క్షీణించసాగింది.

రాజు బావమరిదిని పిలిచి, పిల్లాజెల్లాతో సహా వచ్చి కోటలోనే వుండిపొమ్మన్నాడు.

శక్తిసింహుడికిమాత్రం అంతకంటే కావలసిందేమున్నది? మరునాడే కుటుంబంతోవచ్చి రాజభవనంలో ప్రవేశించాడు.

శక్తిసింహుడే రాజ్యభారం వహించాడు. ఇక యువరాజు—నామకరణంనాడు దాది చేతులలోంచి జారిపడ్డ క్షణమే మొదలు, పసివాని ఆరోగ్యంచెడింది. కళకళలాడే ఆ ముఖంలోని చిరునవ్వు ఆనాటితోనే అంతరించింది. అంతకంటే ఘోరం! ఒక్కొకరోజు పైబడినకొద్దీ శరీరమంతా పెరుగుతూవున్నా, కాళ్ళు మాత్రం సన్నబడటం మొదలుపెట్టి, దాదాపు చీపురుపుల్లలుగా తయారయినై. ఆ కాళ్ళల్లో వీసమెత్తు సత్తువలేకుండా

పోయింది. కాళ్ళు వుండీకూడా కుంటివాడే అయాడుపాపం. అయితే ఈసంగతి రాజు దాకా పోనేలేదు. రాజే కాదు, ఇప్పుడు యువరాజుని పెంచుతున్న దాదికితప్ప మరొకమనిషికి ఈ గుట్టు తెలియకుండా శక్తిసింహుడు కట్టుదిట్టం చేశాడు. ఎంతో జాగ్రత్తగా మసలుకొంటూ రోజుకొకటి రెండు పర్యాయములు మాత్రం పాత్తిళ్ల గుడ్డలతో యువరాజుని తీసుకువెళ్లి రాజుకి చూపుతుండమని దాదికి హెచ్చరిక చేశాడు.



చిన్నవాడిని చూచినప్పుడల్లా రాజు "నాతండ్రి చిరునవ్వు నారాజీతోటే మాయమైంది. పాపం, పసికూన. ఎలా పెంచుతారో!" అని నిట్టూర్చేవాడు. యువరాజు ముఖం కళావిహీనంగా వుండటానికి కారణం కొంతవరకు తల్లిలేని లోపమే అయినా, అంతకంటే ముఖ్యం ఆరోగ్యం చెడిపోవడమే అని పాపం రాజుకేంతెలుసు?

* * *

మూడేండ్లు గడిచినై. దేవసింహుడు ఈపాటికి నడకనేర్చి వుండాలికదా? ఐనా, దాది చిన్నప్పటి లాగనే ఇంకా బిడ్డకు గుడ్డలుకప్పి ఎత్తుకువచ్చి చూపుతున్నది. ఇదిచూచి రాజు "జాగ్రత్తగా పెంచమంటే మరీ అంత చంకదిగకుండా చెయ్యమనా? అదీ అంత మంచిదికాదు. నడవవలసిన వయస్సులో నడవనివ్వాలి. ఏదీ ఒక్కమారు దించు. నాతండ్రి తప్పటడుగులు వేస్తూవుంటే కళ్లారా చూస్తాను" అన్నాడు.

ఏమిచెప్పాలో తోచక, దాది దిక్కులు చూడసాగింది. సరిగా అదేసమయంలో శక్తిసింహుడు అక్కడే వుండటం సంభవించింది. దాది పడుతున్న అవస్థ గ్రహించాడు. ఆమె జవాబు చెప్పేటంతలో తనే కలగజేసికొని "క్షమించాలి. మీతో ఒక మనవి చేదామని చాలకాలంగా అనుకుంటున్నాను. అయితే,

అదేమంత పెద్ద విషయంకాదు కనుక, పని గట్టుకొని చెప్పలేదు. మరొకలాగ..." అని ఆగాడు.

"చెప్పవేయ్ బావా! నాదగ్గిర సందేహ మెందుకు?" అన్నాడు రాజు.

"మరేమీలేదు. మన చిరంజీవిసంగతే. పుట్టినది మొదలుకొని చూస్తున్నాను. బిడ్డడి కాళ్ళు అంత బలంగా కనుపించటంలేదు. తక్కిన అవయువాలన్నీ చక్కగా పెరుగు తున్నవికాని, కాళ్లలోమాత్రం ఏదో లోపం కనిపిస్తున్నది. ఇందుకు అసలు కారణం ఏమైవుంటుందా అని తెలుసుకోవటానికి యెంతో ప్రయత్నించాను. కాని ఏమీ బోధపడిందికాదు. అందుకనే బహుశా దాది బిడ్డడిని క్రిందకు దింపకపోవడం" అని ఎంతో నమ్రతగా మనవిచేసుకున్నాడు శక్తిసింహుడు.

రాజు తెల్లబోయాడు. కోపంకూడా వచ్చింది. "ఇంతకాలంగా ఈ విషయం నాకు తెలియజెయ్యకపోవటానికి కారణం? ఏదీ, బిడ్డడిని ఇలా యివ్వు" అంటూ దాది చేతిలో బిడ్డడిని అందుకున్నాడు. కాళ్లపైనున్న గుడ్డలు తొలగించి ఒక్క చూపు చూశాడు. కృశించిపోయి, ఎముక అయినా వున్నదా లేదా అనే నీరసస్థితిలో వున్న ఆ కాళ్లనుచూచి రాజు కొయ్యబారి పోయాడు. కొద్దిసేపటికి తెప్పరిల్లుకుని, "దారుణం!-తక్షణమే ఘనవైద్యులని రప్పించండి. పొండి" అని బొబ్బలుపెట్టాడు.

రాజ్యంలోని ఘనవైద్యులంతా వచ్చారు. అన్నిరకాల చికిత్సలూ చేశారు. కాని, ఫలితం కనుపించలేదు.

రాణీ ఎడబాటుతోనే కృంగి కృశించి పోయాడురాజు. తలవనితలంపుగా వచ్చిన ఈ అవాంతరంతో పూర్తిగా మంచంపట్టాడు.

కాలం సమీపించిందని గుర్తించు కొన్నాడు. తనూ పోతే మరి యువరాజుకి దిక్కెవరు? [ఇంకా వుంది]






ఒక పేదరాలికి ముగ్గురు కొమాళ్ళు. వాళ్లు పసివాళ్ళుగా ఉండగానే భర్త పోవటంచేత ఆమె కూలీనాలీ చేసి పిల్లలను పోషించ వలసి వచ్చింది.

రెండేళ్ళపాటు ఆమె కష్టపడి శక్తికి మించిన పనిచేసేసరికి ఆరోగ్యం చెడింది. మందూ మాకూ పుచ్చుకోవాలంటే డబ్బేదీ పాపం? అలాగ అశ్రద్ధ ఐపోయి క్రమంగా ఆమె మంచం పట్టవలసిన స్థితివచ్చేసింది.

అప్పుడు కొడుకులు ముగ్గురూ ఒకచోట కూర్చుని ఆలోచించటం మొదలెట్టేరు:

"ఎలాగైనా మనం డబ్బుసంపాదించి, ఆ డబ్బుతో అమ్మకి వైద్యంచేయించాలి. మందు కొనితేవాలి" అన్నాడు పెద్దన్న.

"అమ్మకి నిమ్మళించాక ఇంక ఆమెకు శ్రమఇవ్వకుండా మనమే సొమ్ము సంపాదించి తిండికీ గుడ్డకూ చూసుకోవాలి" అన్నాడు చిన్నన్న.

"సరే బాగానే వుంది, కాని, డబ్బు సంపాదించడం ఎలాగ?" అని ప్రశ్నవేశాడు చిట్టితమ్ముడు.

ఎలాగ అంటే ఎలాగ? అనుకున్నారు అన్నలిద్దరూ.

"నేను ఏ ఆఫీసులోనైనా పనికి కుదురుతాను. మంచి మంచి జీతాలు ఇస్తారుట ఆఫీసుల్లో!" అన్నాడు పెద్దవాడు.

"అలాగైతే నేనూ అపనే చేస్తాను. మన ఇద్దరి జీతాలూ కలిపితే కావలసినంత సొమ్ము!" అన్నాడు రెండోవాడు.

"సరేకాని, ఆఫీసులో పనులు చెయ్యాలంటే మొదట బళ్లోకివెళ్ళి చదువుకోవాలి. మనం చదువుకోలేదే. పని ఎవరిస్తారు?" అన్నాడు చిట్టితమ్ముడు.

"ఆలాగైతే వర్తకం చేద్దాం పోనీ. పనసతొనలో, సపోటాపళ్లో, వేరుసెనగపప్పో కొనితెచ్చి, కేకలువేసుకుంటో వీధివీధికీ

పాలంకి వెంకటరామచంద్రమూర్తి - మద్రాసు



వెళ్ళి అమ్మితే పిల్లలంతా కొనుక్కుంటారు" అని తనకు తోచిన ఉపాయం బయట పెట్టాడు పెద్దన్న.

"ఔను. ఇద్దరం చెరో వీధికీ వెళ్లి అమ్ముకు రావచ్చు. ఈ ఆలోచన చాలా బాగుంది!" అని చిన్నన్న ఆ తీర్మానాన్ని బలపరిచాడు.

కాని చిట్టితమ్ముడు అంగీకరించలేదు. "వర్తకానికి మొదట పెట్టుబడి కావాలి. పనసతొనలూ, సపోటాపళ్ళూ, వేరుసెనగ పప్పూ కొనితేవటానికి సొమ్ము కావాలి. సొమ్మేదీ?...అంతేకాకుండా, పనసతొనలూ, సపోటాపళ్ళూ మొదలైనవన్నీ మనకే చాలా ఇష్టం. తీరా అమ్మటానికి తెచ్చేసరికి మనకే తినబుద్ధివేస్తుంది. కనుక, మీరు చెప్పిన ఉపాయం బాగాలేదు" అని ఖండించివేశాడు.

ఇలాగ ఎన్నో తీర్మానాలు పెద్దన్న తీసుకు రావటం, బాగున్నదంటే బాగున్నదంటూ చిన్నన్న బలపరచబోయేసరికి చిట్టితమ్ముడు ఖండించటం జరిగింది.

ఆఖరికి అన్నలిద్దరికీ కోపంవచ్చి, "ఏం చెప్పినా పనికిరాదంటావు! మేం చెప్పినది చెడగొట్టడమేకాని, నీకు ఒక్క ఆలోచనా తోచదు!" అని చిట్టితమ్ముణ్ణి కసిరారు.

అప్పుడు చిట్టితమ్ముడు, "నాదీ ఒక ఆలోచన ఉంది: ఈఊళ్లో దొంగతనాలు ఎక్కువగా జరుగుతున్నాయనీ, దొంగల్ని పట్టియిచ్చినవాళ్లకి మాంచి బహుమానాలు ఇస్తారనీ రాజుగారు చాటింపు వేశారు, విన్నారుకదా!" అన్నాడు.

"విన్నాం. కాని దానివల్ల మనకేమిటి లాభం? మనం చిన్న పిల్లలం. దొంగల్ని పెద్ద పెద్ద పోలీసులే పట్టుకోలేరు. మనం పట్టుకోగలమా?" అన్నారు అన్నలు.

చిట్టితమ్ముడు, "నిజమైన దొంగల్ని మనం పట్టుకోనేవద్దు. మనం ముగ్గురం

ఉన్నాంకదా. మనలో ఒకడు దొంగ అనుకోవాలి. తక్కిన ఇద్దరూ వాణ్ణి కట్టి తీసుకుపోయి రాజుముందుపెట్టి బహుమానాలు తెచ్చుకోవాలి!" అన్నాడు.

అన్నలకి ఈ ఆలోచన నచ్చి, "నేను దొంగగా ఉంటా"నంటే "నేను దొంగగా ఉంటాను!" అని వాళ్ళు ముందుకొచ్చారు.

అందుకు చిట్టితమ్ముడు "దొంగ ఎంత చిన్నవాడుగాఉంటే అంతమంచిది. కనుక నేను దొంగగాఉంటాను. మీరిద్దరూ నన్ను కట్టితీసుకుపోండి!" అన్నాడు.

అన్నలు "సరే" అన్నారుకాని వాళ్లకొక భయంకలిగింది.

"మనం చిట్టితమ్ముణ్ణి 'దొంగ' అని రాజుగారికి పట్టచెప్పేస్తే, బహుమానం రావచ్చుగాని వాణ్ణి ఖైదులో పెడతారే?"

ఈభయం కలగగానే, వాళ్లు ఆ ఉపాయానికి వప్పుకోలేదు.

చిట్టితమ్ముడు నిబ్బరంగా నిలబడి, "మీరు నేను చెప్పినట్లు చెయ్యకపోతే అమ్మ బతకదు! నేను ఖైదులో ఉండవలసి వస్తుందిగదా అని వెనుదీసి అమ్మని బాధిస్తామా?" అని అనేశాడు.

విధిలేక అన్నలు వప్పుకున్నారు.



వాళ్ళు వప్పుకోడంతోనే చిట్టితమ్ముడు యింకా ఆలస్యం దేనికని, వెంటనే, కట్టుకున్న లాగు తీసేసి గోచీ పెట్టుకున్నాడు. లాంతరుమసి కాస్తంత మొహానికీ వంటికీ రాసుకుని 'దొంగలాగా ఉన్నానా?' అని అన్నలను అడిగేడు.

వాళ్ళకిమాత్రం దొంగ ఎలాగఉంటాడో ఏంతెలుసు? దొంగ అలాగే ఉంటాడు కామోసు అనుకుని, "ఓ, భలేబాగా వున్నావ్‌రా" అన్నారు.

చిట్టితమ్ముడొక నులకతాడు సంపాదించాడు. చేతులు రెండూ నడుం వెనక్కి పెట్టి, నులకతాడుతో కట్టి రాచేసుకున్నాడు.

పట్టుబడ్డ అసలు దొంగలాగే జాలిమొహం పెట్టుకుని బయల్దేరేడు.

చిట్టితమ్ముడు వాళ్ళతో, "మీరు కేకలు వేస్తూ నన్ను లాక్కుపోవాలి! 'నడు-నడు' అని గద్దించాలిగాని ఊరికే ఉండకూడదు!" అని హెచ్చరించాడు.

తమ్ముడు చెప్పినప్రకారం అన్నలు వాణ్ణి రాజవీథివెంట లాక్కుపోసాగారు. 'దొంగని పట్టాం దొంగని పట్టాం' అని కేకవేసేసరికి ప్రతివాడూ వాళ్ళని వెంటాడి, క్రమంగా అదొక పెద్ద గుంపుగా పోగైంది.

కోటగుమ్మంముందు పహరావాళ్లు వాళ్లని లోపలకు వెళ్ళనియ్యమన్నారు.

కాని రాజుగారే స్వయంగా "ఆ పిల్లలు ముగ్గుర్నీ లోపలకి రానివ్వ"మని పహరా వాళ్లకు అజ్ఞాపించారు.

తీరా రాజుఎదటికి వాళ్లువచ్చాక 'ఏమిటర్రా?' అని అడిగేసరికి అన్నలిద్దరూ కంగారుపడి చెప్పవలసిన మాటలు చెప్పనేలేకపోయారు.

మించిపోతుందని తోచి చిట్టితమ్ముడు ధైర్యంగా, "ప్రభూ!—నేను దొంగనండి. వీళ్ళు నన్ను పట్టుకున్నారు! వీళ్ళకి బహుమతి ఇచ్చి పంపేసి నన్ను ఖైదులో పెట్టించండి!" అనేశాడు.

బహుమానాలకోసం వాళ్లు ఈ ఎత్తు ఎత్తేరని కనిపెట్టేశాడు రాజు. "నిజంచెప్పండి" అని అన్నల్ని గద్దించి అడిగేసరికి వాళ్ళు నిజం చెప్పేశారు.

ఐతే రాజు ఆపిల్లల మాతృభక్తికీ, చిట్టివాడి యుక్తికీ సంతోషించి, ఆమెకు వైద్యం చెయ్యాటం కోసమని తన ఆస్థానవైద్యుణ్ణి వెంటనే వాళ్ల యింటికి పంపాడు. కొద్దిరోజుల్లోనే ఆమె తేరుకుంది.

వాళ్లనుపెంచి పెద్దవాళ్లనుచేసి, తనకొలువులోనే రాజు ఉద్యోగంకూడా ఇప్పించాడు.






విదర్భమహారాజులుంగారి కుమారుడు జయంతుడుండేవాడు. అతడు చాలా అందగాడు. ఒక్క అందగాడు మాత్రమేకాదు, మాంచి బలశాలి, పరాక్రమవంతుడూ కూడాను. అతణ్ణి ఎరిగిన ప్రతీ రాజకుమార్తెకూ అతణ్ణే పెళ్లిచేసుకోవాలని కుతూహలంగావుండేది. అందుచేత రోజూ ఏదో ఒక దిశనుంచి స్వయంవరానికి రావలసిందని జయంతుడికి ఆహ్వాన పత్రికలు వస్తూనే ఉండేవి. అనేకమంది రాజులు తమ తమ కుమార్తెల ఛాయా చిత్రాలు పంపుతూ తనకు నచ్చిందీ లేనిదీ వ్రాయమని కోరుతూ ఉండేవారు.

జయంతుడు స్వయంవరాలకు వెళ్ళేవాడు. కాని, పెళ్ళికూతురుని చూసేసి తనకు నచ్చకపోయినపక్షంలో ఆమె పూలహారంతో తనవద్దకు రాకపూర్వమే మెల్లిగా తప్పుకొని అవతలకు వెళ్లిపోయేవాడు. తన వద్దకు రోజూ వచ్చే చిత్రాలనుకూడా అతడు తోసిపుచ్చడమే జరిగేది. ఒక్కొక్క చిత్రమే చూసి, పెదవివిరిచేసి, పక్కన పెట్టేస్తూండేవాడు.

కుమారుడికి ఏ పెళ్ళికూతురూ నచ్చక పోవటం చూసేసరికి విదర్భమహారాణీ గారికి ఆందోళన కలిగింది.

ఒకనాడు జయంతుడికి కబురుచేసి 'కుమారా, జయంతా! ఏ రాజకుమార్తెనో ఒక రాజకుమార్తెను యెంచుకొని పెండ్లి చేసుకోవాలి. నువ్వు వివాహంచేసుకొని బిడ్డల్నికంటే, మనుమల్నీ మనుమరాళ్లనీ చూసుకుని మురిసిపోవాలనిఉంది నాకు. నా కోర్కె తీర్చవా?' అన్నది.

అందుకు జయంతుడు, 'నేనేం చెయ్యను? నాకు ఎవరూ నచ్చటంలేదు. ఈ రాజకుమార్తెలంతా అసలైన రాజకుమార్తెలు కారేమో!' అని అన్నాడు.

---

యస్. మంగతాయారు - రేణిగుంట

---



విదర్భమహారాణీగారూ, యువరాజుగారూ తమదేశానికి వేంచేస్తున్నారని తెలిసి కాశీరాణి వారికి స్వాగతమిచ్చి, తన అంతః పురంలోనే వారికి బస యేర్పాటుచేసింది.

కాశీరాణికి ఒక చక్కనిచుక్కలాంటి కుమార్తె వుంది. ఆ బాల చెక్కిళ్లు గులాబీ రేకులకుమల్లే మృదువుగా మనోహరంగా వున్నాయి. ఆమె చేతులు కలువకాడలకు మల్లే మెత్తగా వున్నాయి. ఆమె నడుస్తోంటే, నడుస్తోన్నట్లు గాకుండా మానససరోవరంలో విహరించే రాజహంసలాగ కనపడేది.

ఆమాటవిని, మహారాణి 'అసలైన రాజకుమార్తెలంటే ఎలావుంటారు నాయనా? నీ ఉద్దేశ మేమిటో నాకు చెపితే అలాంటి వాళ్లను ఎలాఅయినా వెతికి తెప్పించి పెళ్ళి చేయిస్తాను' అని చెప్పింది.

జయంతుడు, 'అసలైన రాజకుమార్తె అంటే అతి సుకుమారి అన్నమాట. నేను చూచినవాళ్లంతా మోటువాళ్ళే కాని నాజూకైనవాళ్ళు కాదు!' అనేశాడు.

ఇలా కొంతకాలం గడిచాక మహారాణీ కాశీయాత్రకని సపరివారంగా బయల్దేరింది. తల్లికి సహాయంగా ఉంటాడని మహారాజావారు జయంతుణ్ణికూడా వెళ్లమన్నారు.

ఆ బాలను చూచీ చూడటంతోనే విదర్భ మహారాణీకి ఆపిల్లను తన కోడలుగా చేసుకోవా లనిపించింది. జయంతుణ్ణి రహస్యంగా పిలిచి, దూరాన కనపడుతోన్న రాజకుమార్తెను చూపి, 'ఏమంటావు?' అని అడిగింది.

అతడు ఆపిల్ల అందాన్ని మెచ్చుకున్నాడు కాని, 'అసలైన రాజకుమార్తె ఔనో కాదో మరి!' అన్నాడు.

'కాకపోవడమేమిటి? ఇలాంటిపిల్ల మనం వెయ్యి సంవత్సరాలు తపస్సుచేసినా లభించదు. ఇక సంశయించక ఈ పిల్లను వరించు' అని విదర్భమహారాణి కుమారునికి నూరిపోసింది. అతడేదో చెప్పబోతోంటే



ఆ మాట వినిపించుకోకుండానే కాశీరాణీ వద్దకు వెళ్లి, 'వదెనా, మీతో నాకు వియ్యం అందాలనివున్నది మరి ఏమిటి మీ వుద్దేశం!' అన్నది దాపరికం లేకుండా.

అందుకు కాశీరాణి, 'అంతకంటే కావాల్సిందేమిటి? కాని మా పిల్ల చాలా సుకుమారి. ఆసంగతి కనిపెట్టి కంటికి రెప్పలాగ కాపాడుకోగల వరుడికేగాని పెళ్ళి చెయ్యాటం ఇష్టంలేక పిల్లకు పెళ్లియీడు వచ్చినా మావారు స్వయంవరం చాటింపించారుకారు. అటువంటి వరు డెక్కడున్నాడో చారులద్వారా వాకబు చేయించి అలాంటి అల్లుడు లభిస్తేనే పెళ్ళి చేద్దామన్నారు' అంది.

విదర్భరాణీ వెంటనే కుమారునితో "నాయనా, నీవు ఎటువంటి భార్యకావాలని ఇన్నాళ్లనించీ కోరుకుంటూ వున్నావో సరిగా అటువంటి పెళ్లికూతురే యిప్పుడు లభించిందోయ్! ఈమె చాలా సుకుమారిట' అంది.

అప్పుడు జయంతుడు, 'మాటల కేమమ్మా, అంతా అలాగే చెబుతారు. ఆమె సుకుమారి ఔనో కాదో పరీక్షచేసిగాని ఒక నిశ్చయానికి రావటానికి వీలులేదు' అన్నాడు.

'సరే' అని రాణీ పరీక్షచెయ్యాటం ఎలాగ అని ఆలోచించటం మొదలెట్టింది. ఇంతట్లో సాయంత్రమైంది. ఇరవైమంది పరిచారికలు తలకొక పరుపూ పట్టుకుని రాజకుమార్తె శయనమందిరంవైపు వెడుతో కంటపడ్డారు.

విదర్భరాణి, 'ఏమర్రా, ఏకంగా ఇన్ని పరుపులు పట్టుకెడుతున్నా రెందుకు?' అని వాళ్లని అడిగింది.

'మా రాజకుమార్తె అతి సుకుమారి. ఇరవై పరుపులూ ఒకదానిపైన ఒకటివేసి పడుకోపెడతాము. లేకపోతే ఆమెకు నిద్ర పట్టదు' అన్నారు. విదర్భరాణి ఈ విడ్డూర మేమిటో చూడాలని వాళ్ళ

వెంటే వెళ్ళింది. ఆ పరుపులు తీసుకు వెళ్ళే పరిచారికల్లో ఒకర్తె బటానీలు నములుతో నడుస్తోంది. వాటల్లో ఒకగింజ జారి క్రిందపడింది.

ఆ గింజను చూసేసరికి విదర్భరాణికి మెరపులాంటి ఆలోచన ఒకటి తట్టింది. ఎవరూ చూడకుండా ఆమె దానిని తీసుకుంది.

పరిచారికలందరూ పట్టుమంచం మీద ఒకదానిమీద ఒకటి ఇరవై పరుపులూవేసి వెళ్ళిపోయారు. రాణీ తాను తెచ్చిన ఆ బటాణీగింజను అట్టడుగు పరుపుక్రిందపెట్టి, ఏమీ ఎరగనట్లు బయటకు చక్కావచ్చింది.

తెల్లవారింది. విదర్భరాణి కాశీరాజ కుమార్తెను చూడటానికని వెళ్ళింది. రాజకుమార్తె రాత్రి నిద్రలేనిదానికిమల్లే బద్ధకంగా కనిపించింది.

"ఏవమ్మా అలావున్నావు?" అని అడిగింది విదర్భరాణి.

"రాత్రి సరిగ్గా నిద్రపట్టలేదండీ!" అంది ఆ అమ్మాయి.

"ఇరవై పరుపుల దొంతరమీద పడుకున్నా నిద్రపట్టలేదా?" అని మళ్ళీ అడిగింది విదర్భరాణి.

ఇంతలో కాశీరాణి ప్రవేశించి, "నౌకర్లు ఏపనీ సరిగ్గా చెయ్యరు. మంచంమీద బటానీగింజ వుంటే చూసుకోకుండానే పరుపులువేసిపోయారు సోమరివాళ్లు! పాపం దీనిమూలాన నా చిట్టితల్లికి రాత్రి నిద్ర పట్టిందిగాదు" అంటూ ఆ బటాణీగింజ తీసి చూపించింది.

విదర్భరాణి జయంతునివద్దకు పరుగెత్తి వెళ్ళి సంగతంతా చెప్పేసరికి, అతడు ఎగిరి గంతేసి సంబంధం నిశ్చయం చెయ్యమన్నాడు.

మర్నాడే మంచి ముహూర్తం వుండటం వల్ల ఆ సుకుమారికీ జయంతునికీ అతి వైభవంగా వివాహం జరిగిపోయింది.






గండకి నదీతీరాన ఒకగొప్ప భవనం. ఆ భవనంలో గోవర్ధనుడనే రాజు. ఆ రాజుకు మాయ, ఛాయ అని ఇద్దరు కుమార్తెలు. అక్కా చెల్లెళ్ళు ఇద్దరూ ఒకే అచ్చున పోసినట్టు వుండటంచేత, అందులో మాయ ఎవరో, ఛాయ ఎవరో గుణాలను బట్టి తెలుసుకోవాలేగాని, చూపులనుబట్టి తెలుసుకోడం కష్టమయ్యేది.

వాళ్లకు యుక్తవయస్సు వచ్చింది. ఎన్నో సార్లు రాజు స్వయంవరం ఏర్పాటుచేశాడు. కాని, వాళ్లకు ఒకళ్ళూ నచ్చలేదు. రాజుకు విసుగెత్తిపోయింది.

ఒకనాడు, వాళ్లను పిలిచి: "అమ్మాయిలూ!–మీ పెళ్లిగొడవ ఇకనేను తలపెట్ట దలచుకోలేదు. ఏ శ్రమయినాపడండి, భర్తలను ఎంచి తెచ్చుకొండి. అవసరమైతే దేశాటనంకూడా చెయ్యండి, వద్దనను" అని కచ్చితంగా చెప్పివేశాడు.

ఇలావుండగా, ఒకరోజున అడవులలో లేళ్లను వేటాడుకొంటూ కీర్తికాంతుడనే రాజకుమారుడు ఆ తీరానికి వచ్చాడు. ఆ సమయాన అక్కడ రాకుమార్తెలిద్దరూ బంతి ఆడుకుంటున్నారు. 'బంతిని ఎవరు ఎక్కువ ఎత్తుకి ఎగురవేయగలరో, వాళ్ళు గెలిచినట్టు' అని పందెంవేసుకున్నారు.

అక్కడనేవున్న కీర్తికాంతుడు: "ఓస్సి–ఇదొకగొప్పా!—బంతికొడితే మేఘమండలానికి తగలాలి" అన్నాడు.

రాకుమార్తెలు "బడాయిలెందుకు, చేతనైతే కొట్టిచూపించు" అన్నారు.

"నాకేం బహుమతి ఇస్తారో చెప్పండి" అన్నాడు కీర్తికాంతుడు. అప్పుడు అతనిని వాళ్ళు తమ తండ్రివద్దకు తీసుకపోయారు.

రాజు అతనిని ఆదరించి, తన ఉద్యాన వనంలో బంతిఆట పోటీకి ఏర్పాటుచేశాడు. ముందు, రాజకుమార్తెలు బంతి విసిరారు.

పి. కళ్యాణసుందరం - కాకినాడ




తరువాత, కీర్తికాంతుడు విసిరేసరికి, అతని మంత్రబలంవల్ల అది మేఘమండలంలోకి పోయి తిరుగా భూలోకంలోకి రానేలేదు. అతని ప్రజ్ఞకు అందరూ ఆశ్చర్యపోయారు. రాజు సంతోషించి; "రాకుమారా! చూడగా నీవు మొనగాడివిగా కనబడుతున్నావు. నా కుమార్తెలను ఇద్దరనూ పెళ్లిచేసుకో. నా రాజ్యంలో అర్థరాజ్యాన్ని ఏలుకో," అని కోరాడు.

తాముకూడా మంత్రవిద్య నేర్చినవాళ్లే గనుక, కీర్తికాంతుని చూడగానే రాజ కుమార్తెలకు 'చేసుకుంటే ఇటువంటి ప్రజ్ఞాశాలినే పెళ్ళిచేసుకోవాలి' అని కుతూహలం కలిగింది. ఐతే—చూపులకు ఇద్దరూ ఒక్కలాగానే వున్నప్పటికీ, కీర్తికాంతుని మనసు ఏమోగాని మొదటినించీ ఛాయ వైపే మొగ్గుతూ వచ్చింది. అతడు తన మనసును రాజుకు వెల్లడించాడు. కాని, రాజు: "నాయనా!—పెద్దపిల్లకు పెళ్ళి అయితేగాని చిన్నదానికి చెయ్యటానికి శాస్త్రం వప్పదు. కనుక, ఇష్టమయితే ఇద్దరనూ చేసుకో, లేకుంటే మాయాదేవినే చేసుకో" అన్నాడు.

అందుకు కీర్తికాంతుడు: "సరే, మీ కుమార్తెలకు మంత్రవిద్యలో నేనొక పరీక్ష పెడుతున్నాను. మూడురోజుల లోపల ఎవరు ప్రజ్ఞచూపితే, వాళ్ళను పెళ్లాడుతా," అని చెప్పాడు. రాజు ఒప్పుకున్నాడు.

తెల్లవారేసరికి కీర్తికాంతుడు అదృశ్యమైపోయాడు. కాని, కనురెప్ప మూయకుండా మాయ అతనిని రాత్రిపూట అంతా కనిపెడుతూనే వున్నది. పిట్టకైనా తను మాయమైపోవటం తెలియదనుకున్నాడు కీర్తికాంతుడు. అతనికి తెలియకుండానే వెంబడించింది మాయాదేవి. పోతే, సమయం వచ్చినపుడు ప్రజ్ఞను చూపవచ్చు గదా అని ఛాయ అక్కడనే వుండిపోయి,



తన మంత్రశక్తివల వాళ్లపర్యాలను కని పెడుతూవుంది.

రాత్రి బయలుదేరిన కీర్తికాంతుడు వెనుతిరిగి చూడకుండా అడవులలో అలా పోతూనేవున్నాడు. మాయకూడా నీడలాగా అతనిని వెంబడిస్తూనేవుంది. తెల్లవారగానే అతడొక మామిడిచెట్టుకింద విశ్రాంతితీసుకో సాగాడు. అంతలోనే తనను పేరుపెట్టి వెనుకనించి ఎవరో పిలుస్తున్నట్టయింది. నలుమూలలా పారజూచాడు. ఎవ్వరూ కనబడలేదు. కాని, ఆ ధ్వనిమాత్రం సరీగా మాయాదేవి కంఠధ్వనిలాగా వుంది.



గ్రహించాడు కీర్తికాంతుడు. చెట్టెక్కి కూర్చున్నాడు. మనిషి ఎవరూ కనిపించ లేదు. ఐనా, తను కూర్చున్న ఆ చెట్టును ఎవరో గొడ్డలితో నరుకుతూవున్నట్టు చప్పు డయింది. చప్పుడు కావటమేకాదు. కొంత సేపటికల్లా చెట్టు పడిపోబోతుందా అన్నట్టు కదలికకూడా పుట్టింది.

అప్పు డతడు చిటారుకొమ్మ విరిచి, మంత్రించి గాలిలోకి వదిలి, తాను దాని పైన కూర్చున్నాడు. అది విమానంలాగా ఎగిరిపోయింది. కీర్తికాంతుడు ఎవళ్ళకూ పట్టుబడకుండా ఆకాశమార్గాన వెళుతూ ఉన్నాడేకాని, అతనివెంబడే భూమిమీద మాయకూడా వెళుతూనేవుంది.

ఎంతసేపని ఎగురగలడు పాపం, కీర్తి కాంతుడు! మట్టమధ్యాహ్న మయేవేళకు విమానం దిగి అతడు ఒక చింతచెట్టుకింద విశ్రాంతి తీసుకోబోయాడు. ఆ చెట్టుకు పైన ఒక పెద్ద తొర్ర వున్నది. అతడు ఆ తొర్రలో దూరాడు. దూరి, ఒక భయంకర మాయ సర్పాన్ని కాపలాపెట్టాడు.

మాయాదేవి ఈ చెట్టువద్దకు చేరుకున్నది. కీర్తికాంతుడు ఆ తొర్రలో వుండితీరుతాడని నిశ్చయించింది. కాని, క్రూరసర్పం కాటు వేస్తుందే! చేసేదిలేక, మళ్ళీ గొడ్డలితో




అతను వేటకువెళ్లి వచ్చేటంతలో గుడ్డ పరిచినచోట చక్కటి కుటీరం వెలిసింది. ఆ కుటీరంలోనించి ఒక అందమైన చిన్నది అతనికి ఎదురువచ్చింది. 'రాజకుమారా!—నేను ఈ వనరాజ కూతురును. మంత్రాలు, తంత్రాలూ మా ఇంటివిద్యలు. నా మహిమ వల్లనే ఇంతలో ఈ కుటీరం సృష్టించగలిగాను. నేను నీ సేవచేసుకుందామని వచ్చాను, అంగీకరించు' అనిచెప్పి, అతడు తెచ్చిన చేపలను అందుకున్నది.

చేపలను అతిరుచిగా వంటచేసింది. కాని, ఒక్కముక్కయినా అతనికి రుచి చూపకుండా అంతా తనే మింగివేసింది. ఎంతట భోజనానికి పిలుస్తుందా అని కని పెట్టుకునివున్న కీర్తికాంతుడు పట్టలేక వంటగదిలోకి వెళ్లగా, నిజంతెలిసివచ్చింది. అసలే ఆకలితో మండిపోతున్న అతనికి కోపం ఆగలేదు. ఆమెను మెత్తగా తన్నుదామనుకొనేటంతలో ఆ కన్య మళ్లీ తోడేలు రూపంపొంది, వికటంగా నవ్వుతూ పారిపోయింది! ఆమె మాయాదేవి అని తెలుసుకొన్నాడతడు.

ఐతే, ఎలా చిత్తుచేయటమా అనే తీవ్రాలోచనతో అక్కడనే ఉండిపోయాడు.

చెట్టు కొట్టనారంభించింది. ఎంత కొట్టినప్పటికీ, ఉక్కును మించిన ఆ గట్టిచెట్టు ఆమెకు లొంగలేదు. గొడ్డలి ముక్కలైంది!

తొర్రలో కూర్చుండే కీర్తికాంతుడు విల్లు ఎక్కుపెట్టి బాణం వదిలాడు. కాని, మాయ తక్షణమే ఒక తోడేలుగా మారి, వికటంగా నవ్వుతూ పారిపోయింది.

ఇంతలో అతనికి మిక్కుటమైన ఆకలి వేసింది. తొర్రనుండి ఇవతలకువచ్చాడు. పైమీదిగుడ్డ కిందపరిచాడు. 'ఇప్పుడు అడవులలోకి వేటకువెళ్లి రావటం ఆలస్యమవుతుంది; నాలుగు చేపలను పట్టితెద్దాం' అనుకొని, గంటకీనదికి బయల్దేరాడు.

మరునాడు మళ్లీ కీర్తికాంతుడు చెట్టు కింద గుడ్డపరిచి చేపలకోసం గండకీనదికి వెళ్లాడు. మూడు చేపలు పట్టితెచ్చాడు. అతడు చెట్టు కిందకు వచ్చేటప్పటికల్లా నిన్నటిమో స్తరుగానే మళ్ళీ ఒక కుటీరం కనిపించింది. 'ఓహో మాయలమారి మళ్లీ వచ్చిందా!' అనుకుంటూ ఉగ్రుడై అలానే నిలబడివున్నాడు.

అంతలోనే కుటీరం లోపలినుండి ఒక అందమైన చిన్నదివచ్చి ఎంతో వినయంగా అతని ఎదట నిలబడింది. చూడగా ఈకన్య నిన్నను వచ్చినఆమెకు అచ్చ చెల్లెలేనా అనిపిస్తున్నది. అతడు పలకరించలేదు. ఆమె అతని చేతిలోని చేపలను అందు కొంటూ, "రాజకుమారా!—నేను ఈ వన రాజుకు చిన్నకూతురను. మంత్రతంత్రాలు మాయింటివిద్యలు. నా మంత్రబలంవల్లనే ఈకుటీరం నిర్మించగలిగాను. నీసేవచేసు కోవాలని వచ్చాను ఏలుకో' అన్నది.

మాయాదేవి మళ్ళీ ఈవేషంతో వచ్చిం దని తలచి, అతడు తగు జాగ్రత్తలోనే వున్నాడు. ఆమె క్షణంలో వంటచేసి, అతనికి వడ్డించింది. ఆమెనుకూడా తన పంక్తిని కూర్చోమన్నాడు.




అందుకు ఆమె "నేను మీభోజనమైన తరువాత తింటాను. స్త్రీలకు అదేమర్యాద. ఇంతకూ నేను చేపలనుమాత్రం తినను. మీపైనుండే భక్తిచేత వండిపెట్టానేకాని, వాటిని తాకటం నా కిష్టంలేదు. నాకొక శాప మున్నది. ఏనాడైతే కాలువపొంగి నాకాళ్లను తాకుతుందో తక్షణమే నేనూ, నాసంతతీ కూడా చేపలమైపోతాము' అని చెప్పింది.

ఆమెమాటలు అతనికి నచ్చినై. ఆమె మాయాదేవి ఐవుండదని నిశ్చయించుకొని ఆమెను పెళ్ళిచేసుకొన్నాడు. ఆ కుటీరం లోనే కాపరంపెట్టాడు. కొంత కాలానికి వారికి ఇద్దరుబిడ్డలుకూడా కలిగారు.

ఆమెచెప్పిన శాపం కీర్తికాంతునికి ఎప్పుడూ గుండెలో మెదులుతూనేవుంది. అందుచేత వారు ఎక్కడయినా కాలవ దాటవలసివస్తే ఆమెకాళ్ళు తడవకుండా ఎత్తుకొని దాటించేవాడు.

ఒకరోజున భార్యా బిడ్డలను వెంటబెట్టుకొని కీర్తికాంతుడు కొండలకు పోయివస్తున్నాడు. దారిలో ఒక చిన్నకాలువ దాటాలి. అతడు దాటాడు. భార్యా, బిడ్డలూ వెనక వస్తున్నారు. 'ఈ చిన్నకాలువకేముంది' అనుకొని అతడు ముందు వచ్చేస్తున్నాడు.

ఐతే, ఆ చిన్నికాలువ ప్రళయంగా పొంగింది. వాళ్ళ కాళ్ళు తడియటంచేత ముగ్గురూ మూడు చేపలుగా మారిపోయి, కాలువలో కొట్టుకపోసాగారు! 'నాతప్పు తెలుసుకున్నాను. శాపం తప్పించుకునే మార్గం లేదా?' అని దీనంగా అడిగాడు కీర్తికాంతుడు. 'ఇది మాయ. నావల్ల ఏమీకాదు' అన్నది ఆ కన్య.

అప్పుడు మళ్ళీ మాయ అతని ఎదటికి వచ్చి 'ఇప్పుడైనా నేను నీకు నచ్చుతానా? నన్ను పెళ్ళాడతావా?' అని అడిగింది.

'ఎటువంటి కష్టాలైనా రానీ, నా మనసు మారదు' అన్నాడు అతడు నిష్కర్షగా.

అప్పుడు భవాని ప్రత్యక్షమైంది: 'నాయనా! కీర్తికాంతా!!—మాయా ఛాయా నా అనుగ్రహంవల్ల పుట్టిన బిడ్డలు. నీ వనుకొన్నట్టు చూపులకేకాదు, గుణాలకు కూడా ఇద్దరూ ఒక్కటే. నీవంటి మొనగాడిని ఎంచి పెళ్ళిచేసుకోమని నేనే వాళ్ళకు చెప్పాను. మాయాదేవి పరీక్షకు నీవు నిలిచావు. గెలిచావు. ఇంతవరకు నీ భార్యగా వున్నదే ఛాయ. మాయనుకూడా పెళ్లాడి సుఖంగా వుండు'మంటూ దీవించి అంతర్హితమైంది. అంతలోనే కాలువలోని నీరంతా ఇంకిపోయి, ఛాయా ఇద్దరుబిడ్డలూ చక్కా వచ్చారు. అందరూ కలిసి గోవర్ధనమహారాజు భవనానికి పోయి హాయిగా వున్నారు.






కాపవరములో కామయ్యసెట్టి అనే అతను ఒకడుండేవాడు. అతనికి ధనాలు అనే భార్య ఉండేది. కామయ్య పెద్దవాడు కావటంచేత తన వ్యాపారమంతా ఇద్దరు కొడుకులకూ వప్పజెప్పి, భార్యతో 'నువ్వు కూడా ఇంటిపెత్తనం కోడళ్ళమీద పెట్టేసి నాతో రా. రోజూ సాయంత్రంవెళ్లి పురాణం విని వద్దాం' అన్నాడు.

'అలాగే నడవండి. పురాణమేగదా. డబ్బిచ్చి చూచేదిగనకనా, రాననటానికి?' అని అంటూ, రోజూ భర్తతో కన్యకాపరమేశ్వరి ఆలయానికి వెళ్ళి, సూరిశాస్త్రులు గారి పురాణం వినివస్తూండేది.

పురాణం ఆరంభించి, పూర్తిఅయేవరకూ కామయ్య ఎంతో శ్రద్ధగా వింటూండేవాడు. ధనాలుకూడా వింటూండేదిగాని, ఆవిడకు ఒక్కొక్కప్పుడు వినుగేసుకొచ్చి 'పోదామా' అనిపించేది. కాని, పూర్తి అయేవరకూ ఉంటే ప్రసాదం ముడుతుందికనక, అది పోనివ్వడమేమని చెప్పి, చివరిదాకా ఓపికగా కూర్చునేది.

ప్రసాదంక్రింద ముట్టిన వడపప్పు, పంపరపనాసతొనే, అరటిపండు ముక్కలో భద్రంగా పట్టుకెళ్లి తనకూతురు కాసులక్ష్మి చేతులో పడవేసేది. ఎప్పుడూ కూతురుచేతులలోనే పడేసేది కాని, ఇద్దరు కోడళ్ళనూ చక్కా పిలిచి 'ఇదిగోనమ్రా' అని ఒక్కనాడుకూడా ఆ ప్రసాదం ఇచ్చేదికాదు.

ఆఖరికి ఒకనాడు కామయ్యే కలగజేసుకొని "ఎప్పుడూ కోడళ్లచేతిలో విదల్చవేమి? ఇంత పక్షపాతమేమిటని అనుకోరా వాళ్లు? కోడళ్ళనికూడా కూతుళ్ళతో సమంగా చూసుకోవాలి సుమా" అన్నాడు.

భర్త ఇలాగ అనేసరికి తనసంగతి మగవాళ్లకికూడా తెలిసిపోయిందే అనీ, కోడళ్లని సరిగ్గా చూడటంలేదని తెలిస్తే కొడుకులకు

కె. అలివేలుమంగ - జయపురం



తనమీద గౌరవం తగ్గిపోతుందనీ అనిపించి, 'ఇంక పెట్టుపోతల్లో జాగ్రత్తగా ఉండాలి' అని నిశ్చయించుకుంది.

అవిశ ఆ నిశ్చయానికివచ్చిన మర్నాడు పురాణంలో సూరిశాస్త్రులుగారు శ్రీరాముల వారి జననాన్నిగూర్చి యిలా చెప్పేరు.

"పుత్రులకోసం దశరథుడు పుత్రకామేష్ఠి యాగం చెయ్యగా, హోమగుండంలోంచి అగ్నిహోత్రుడు పచ్చి, 'రాజా! ఈ పాయసాన్ని నీ భార్యలకు ఇయ్యి. వారు గర్భవతులై పుత్రులను కంటారు' అనిచెప్పి, ఒక పాత్రను దశరథునికిచ్చి, అంతర్ధానమయ్యాడు. రాజు ఆ పాయసాన్ని రెండు భాగాలుచేసి, సగం కౌసల్యాదేవికి ఇచ్చి సగం కైకేయికిచ్చి ఊరుకున్నాడు. సుమిత్రకేమీ ఇవ్వనేలేదు. ఐతేం? కౌసల్యా తన సగంలో సగంతీసి సుమిత్రకిచ్చింది. కైక కూడా అలాగే చేసింది. ఈవిధంగా ఆమెకే ఎక్కువ ముట్టింది ఆఖరికి. సుమిత్రకు రెండు వాటాలు ముట్టడంచేత ఇద్దరు కొడుకులు పుట్టేరు. కౌసల్యకీ, కైకకీ ఒక్కొక్కడే పుట్టారు."

ఈకథ విన్న ధనాలుకి, విశేషం ఒకటి తోచింది. దశరథుడికి సుమిత్రపైన ఎక్కువ ఇష్టం! కనుక అటు పట్టమహిషి అయిన కౌసల్యాపైనా, ఇటు ముద్దులరాణీ అయిన కైకేయిపైనా ప్రేమ నటించి, చివరికి సుమిత్రకు రెండు వాటాలొచ్చేటట్లు పన్నాగం పన్నేడు! గడుసుతనం అంటే అలా ఉండాలి!'—ఇదీ ఆమెకు తోచిన విశేషం. తనుకూడా దశరథునికి మల్లేనే గడుసుతనం చూపి, కోడళ్లపైన కూతురిమీదకంటే ఎక్కువ ప్రేమ నటించాలనుకుంది.

ఆరోజున పురాణం అయాక ప్రసాదం క్రింద అందరికీ తలకొక బత్తాయిపండూ ఇచ్చారు. కామయ్య రోజుకుమల్లేనే తన వంతుప్రసాదంకూడా భార్యచేతిలో పెట్టేడు.

ఆమె ఇంటికి వెళ్లటంతోనే రోజూ మల్లే ఆ పళ్లను కాసులమ్మ చేతిలో పడెయ్యలేదు. పెద్దకోడలైన బంగారమ్మని పిలిచి ఒక పండూ, రెండోకోడలు వరహాలమ్మని పిలిచి రెండోపండూ చేతిలో పెట్టింది.

ఇద్దరు కోడళ్లూకూడా ఆశ్చర్యపోయారు. 'రోజూ కాసులమ్మకి ఇచ్చేవారు, ఇవాళ మాకు ఇచ్చారేమిటి?' అని స్పష్టంగా అడిగేశారు కూడాను.

అందుకు అత్తగారు, 'ఇదివరకుతెచ్చిన ప్రసాదం ఎప్పుడూ రవంతే ఉండేది. అది మీకిస్తే చెయ్యంటూ, నోరంటూ కావటం తప్ప కొండనాలికకయినా కబురందదని చెప్పేసి కుర్రదానిచేతిలో పడేసేదాన్ని. ఇవ్వాళ చెరివక పండూవచ్చింది, కనక మీకిచ్చాను'అంది.

'సరేకాని, ఆడబడుచుకు లేకుండా మాకా?' అన్నారు కోడళ్ళిద్దరూ.

'ఆడబడుచుకు వేరే వాటా యేమిట్రా? మీరిద్దరూ చెరోచెక్కా యిచ్చినా చాలు!' అంది అత్తగారు తడుముకోకుండా.

'ఔనత్తా, ఆ మాత్రం తోచిందే కాదు మాకు' అంటూ బంగారమ్మా, వరహాలమ్మా చెరోచెక్కా తీసి కాసులమ్మకు ఇచ్చారు.




ధనాలు, కోడళ్ళచేతిలో తలకొక పండూ పెడుతూఉండగా చూచిన కామయ్యా, అతని ఇద్దరు కొడుకులూకూడా ఆమె ఉదారబుద్ధికి సంతోషించి చక్కాపోయారే గాని, తరవాత యేంజరిగిందీ వాళ్ళకి తెలియనే తెలియదు.

ధనాలుమట్టుకి తన పన్నాగం సరిగా పారినందుకు తన్నుతానే మెచ్చుకుంది. 'పురాణం వినటంవల్లనేకదా నాకి ఉపాయంతోచింది? పెద్దలు ఊరికేచెప్పేరా పురాణాలు వినమని? ఇలాంటి లాభం కలుగుతుందనే వినమన్నారు' అనుకుని, సంతోషించింది.




స్వర్గంలో దేవేంద్రునికి ఆధిపత్యంరాగానే అన్ని లోకాలనుగురించీ ఆయన చేయవలసిన పనులు చేసి, చివరకు భూలోక మందు ప్రజలకు ఎలా సౌఖ్యం చేకూర్చటమా? అని ఆలోచించాడు. ఏడు చుక్కలను ఎదటికి రమ్మన్నాడు. అవి వచ్చి చేతులుకట్టుకొని వరసన నిలబడినై.

చుక్కలు ఏడూ అలా నిలబడి ప్రకాశించేసరికి, గొప్ప వెలుగు వెలిగింది. భూలోకంలో ప్రజలంతా తలలెత్తి ఆకాశం వైపు చూచారు. ఆ వెలుగుచూచి వాళ్ళు ఆశ్చర్యపడటమే గాక అదేదో ప్రళయమై వుంటుం దనుకొని భయపడ్డారుకూడా.

చుక్కలు ఏడూ కలిసి ఏకకంఠంతో "ఏమిటి సెలవు ప్రభూ?" అని అడిగినై.

"భూలోక ప్రజలకు సౌఖ్యాన్ని సమకూర్చ దలిచాను. ఊరక యిస్తే ఏ వస్తువుకూ విలువలేదు. కనుక, మీరు పోయి నేనిచ్చే వస్తువులను వాళ్లకు విక్రయించి రావాలి" అన్నాడు దేవేంద్రుడు.

"అలానే దేవరా!" అంటూ పలికినై తీయని కంఠస్వరాలతో ఏడు చుక్కలూ. ఆశ్చర్యంగాచూస్తూవున్న భూలోక ప్రజలకు స్వర్గంలో అమరగానం వినిపించిందప్పుడు.

వరసన నిలబడివున్నై చుక్కలు. మొదటి నక్షత్రానికి దేవేంద్రుడు ఒక చక్కటి డబ్బీ చేతికిచ్చాడు. 'ఇదుగో, ఇది హాస్యరసం. ఇది సేవించినవాళ్లకు సంతోషమిస్తుంది. సంతోషమే జీవికి బలం' అన్నాడు. రెండవ చుక్కకు ఒక డబ్బీ ఇచ్చి 'ఇది సౌశీల్యం. ఇదే ప్రాణికి జీవం' అని చెప్పాడు. మూడవ దానికీ ఒకటి యిచ్చాడు. 'ఇది ఆరోగ్యం. ఆరోగ్యమే మహాభాగ్యం' అన్నాడు. నాల్గవ దానికి ఒకటిచ్చాడు. 'ఇదే చిరజీవత్వం. బ్రతికి బాగావుంటేనే ఏజీవియైనా పనిచేయ గలిగేది' అని చెప్పాడు. ఐదవ చుక్కకు

యస్. యమ్. పట్నాయక్ - జంషెడ్పూర్

ఒక డబ్బీయిచ్చి 'ఇది కీర్తి. మానవునికి పేరూ ప్రతిష్ఠా కలిగిస్తుంది' అన్నాడు. ఆరవదానికి ఒక డబ్బీ యిచ్చి 'ఇది ఆనందం. దీనికోసమే మహర్షులుకూడా తాపత్రయపడుతూవుంటారు' అని చెప్పాడు. ఏడవదానికీ ఒకడబ్బీ యిచ్చి, "ఇదే ఐశ్వర్యం. జీవితరథం సాగటానికి అగత్యమైన సాధనం' అని చెప్పాడు.

చుక్కలు ఏడూ భూలోకానికి దిగి డబ్బీలలో సరకు అమ్మజూపినై. నాలుగోచుక్క వీథులంట తిరుగుతూ 'దీర్ఘజీవితం కావాలా! దీర్ఘజీవితం!!' అంటూ విక్రయించేసరికి జనులు 'మాకుకావాలి' 'మాకు కావాలి' అంటూ ఎగబడ్డారు.

'ఐతే,నాసోదరీమణులు విక్రయించేవస్తువులు కొన్నారా, మరి? పెద్దక్క డబ్బీలో హాస్యరసం, రెండవదానిలో సౌశీల్యం, మూడదానిలో ఆరోగ్యం వున్నై. ఐదవ చెల్లి కీర్తి, ఆరవది ఆనందం, ఏడవది ఐశ్వర్యం అమ్ముతున్నారు. అవి మీరు కొననేలేదా?' అని అడిగింది. 'లేదు, లే'దన్నారు ప్రజలు.

'అవిలేకుండా నా డబ్బీలోని మందు మీకు ఉపకరించదు. అవన్నీ ఉన్నవాళ్ళకే దీర్ఘజీవితం సార్థకమవుతుంది. పొండి, పొండి!' అంటూ డబ్బీ మూతవేసేసింది నాలుగోచుక్క.

ఐతే—మచ్చుకోసమని చేతిలో పెట్టుకొనివున్న మందు మళ్ళీ డబ్బీలో వేయటం బద్ధకమనిపించింది. అక్కడనే ఒక చెట్టుకొమ్మమీద ఒక రామచిలుక కనిపించేసరికి నాలుగోచుక్క చిరునవ్వుతో చిలుక ముక్కుకు అందించింది ఆ మచ్చుమందు. ఆ మందు తినగా, రామచిలుక మూడు వందల సంవత్సరాలు జీవించడానికి అది సరిపోయింది. అందుకనే చిలకలు నేటికీ చిరజీవులుగా వుంటున్నై.





# పనికిరాని పుస్తకం

సర్వజ్ఞపాలుడు అపూర్వ మేధావి. మంత్ర తంత్రాలవల్ల అనేక ఘనకార్యాలను సాధించ గలిగినవాడు. ఏ చికిత్సకూ కుదరని ఎన్నో దీర్ఘవ్యాధుల్ని అతడు తన అమోఘ శక్తిద్వారా యిట్టే కుదర్చగలిగేవాడు. శక్తినీ సామర్థ్యాన్నీ ప్రజల మేలుకోసమే వినియోగించిన రాజులలో సర్వజ్ఞపాలుడే మొదటివాడు.

అతనికీర్తి దేశదేశాలా వ్యాపించి, ఖండ ఖండాంతరాలకూ అల్లుకుపోయింది. ఆ కాలంనాటి వైద్య, వేదాంత, ఖగోళ శాస్త్రాలకు అంతుదొరకని ప్రతి చిక్కుసమస్యకూ సర్వజ్ఞపాలుడు కనురెప్పపాటులో పరిష్కార మార్గం చూపగలిగేవాడు.

ఇంత గొప్ప విజ్ఞానాన్ని, కేవల మానవ మాత్రుడు పొందగలగడం సాధ్యమేనా ?— ఈ అనుమానం యితర రాజులకూ, చిన్నా పెద్దా పండితులకూ కలిగింది. రాజు పట్టి తెలివితక్కువవాడనికూడా వాళ్లకు దురభిప్రాయం వుండేది. అందువల్లనే అంతా స్వయంగా పరీక్షించి తెలుసుకోవాలని సర్వజ్ఞపాలుడివద్దకు వచ్చారు.

సర్వజ్ఞపాలుడు అందరనూ ఉచితరీతిని సత్కరించాడు. దర్బారు ఏర్పాటు చేశాడు.

అయాదేశపు రాజులూ, పండితులూ సభను అలంకరించారు. ఉచితానుచిత ప్రశ్నలలో సర్వజ్ఞపాలుణ్ణి అగ్నిపరీక్షకు గురిచేశారు. ఏ కోపమూ తాపమూ లేకుండా సర్వజ్ఞపాలుడు అందరనూ తగిన నిదర్శనాలతో సంతృప్తిపరిచాడు.

సభ నిశ్శబ్దంగా వుంది. అంతా అనుమానరహితులైనట్టే కనబడ్డారు. సర్వజ్ఞపాలుడు సింహాసనంమీదినుంచిలేచి అందరివంకా చిరునవ్వు నవ్వుతూ చూచాడు.

సభలో ఒకమూల చిన్న అలికిడి పెద్ద కలకలంగా మారింది. 'నేనా-నువ్వా' అను

జి. వి. హరనాథ్ - అనంతపురం

కుంటూ బారుగడ్డం పెరిగిన పండితుడూ, పొడుగాటిమీసం పెంచిన ఒకరాజూ లేచి నిలబడ్డారు. సర్వజ్ఞపాలుడు వారిద్దరివంకా పరీక్షగా చూసి తల పంకించాడు.

"ఏ జీవినైనా చంపి బ్రతికించగలరా" అన్నారు పండితుడూ, రాజూ.

"ఓ!" అన్నాడు తొణకకుండా సర్వజ్ఞ పాలుడు. తరవాత—ప్రశ్నించిన ఆ యిద్దరి వంకా చూస్తూ "మీలో ఎవరు ఆ పరీక్షకు సాధనంగా వస్తారు?" అని అడిగాడు.

రాజూ పండితుడూ ఒకరి మొహాలు ఒకరు చూచుకొని, అందరివంకా చూసి, తెల్లబోయి, కుర్చీలలో కూలబడ్డారు.

సర్వజ్ఞపాలుడు నవ్వుకున్నాడు. "మాన వుల్లోనేకాక, పశు పక్ష్యాదుల్లోకూడా జీవం ఉన్నదనుకుంటాను!" అంటూ చిలిపిగా సభాసదులవంక చూశాడు.

సభంతా ఏకకంఠంతో "అవును! అవును!" అన్నది. సర్వజ్ఞపాలుడు వెనక్కి తిరిగిచూశాడు. "చిత్తం! ఏమి సెలవు!" అంటూ సేవకుడు ముందుకువచ్చాడు.

"మన తోటలో పెరుగుతూవున్న కోడి పుంజులలో ఒకదానిని పట్టుకురా" అని అజ్ఞాపించాడు, సర్వజ్ఞపాలుడు.



ఐదునిమిషాలూ ఐదుయుగాల్లా తోచింది సభలోని రాజులకూ, పండితులకూ. "ఈ దెబ్బతో ఈయనగారి సరుకు బయట పడుతుంది!" అని ఒకరాజు పక్కన కూర్చున్న మరోరాజు చెవిలో వూదాడు. "ఈ పరీక్షతో సర్వజ్ఞుని పస తేలి పోతుందిలే!" అని నసిగాడు ఒక పండితుడు పక్కనవున్న మరొక పండితుడితో.

కోడిపుంజుతో సేవకుడు దర్బారు ప్రవే శించాడు. సర్వజ్ఞపాలుడు కత్తితీసుకుని పుంజుతలను పరపర కోశాడు. తరవాత ఒకచేత్తో తలనూ ఒకచేత్తో మొండాన్నీ, పట్టుకుని అందరికీ చూపుతూ "కోడిపుంజు



రెక్కలుకొట్టుకుంటూ 'కొక్కొరోకో' అని అరుస్తూ దర్బారునుంచి బయటకు పరిగెత్తింది.

భయాశ్చర్యాలతో సభలోని రాజులూ, పండితులూ వుక్కిరిబిక్కిరయ్యారు. ఒక్కమారుగా లేచి, తలలువంచి సర్వజ్ఞపాలుని గొప్పతనానికి జేజేలు పలికారు.

"ఇన్ని అద్భుత విద్యల్ని ఎలా నేర్చారుప్రభూ?" అని అడిగారు అంతా.

"తెలుసుకొంటారా?" అన్నాడు రాజు.

"తెలుసుకోవడమేకాదు, సాధించితీరాలనికూడా వున్నది" అన్నారు కొందరు.

"అయితే వినండి!" అంటూ ప్రారంభించాడు సర్వజ్ఞపాలుడు:

"నాకు చిన్ననాటనే అద్భుత కార్యాలు చేయాలనీ, అపరశక్తుల్ని పొందాలనీ బలమైన కోరిక వుండేది. ఇందుకు సాహసం అవసరమని గ్రహించాను. ఈ ప్రపంచంలో అసాధ్యమైన ప్రతిదానినీ, సుసాధ్యంచేసే మార్గాలన్నీ ఒక గ్రంథంలో రాయబడి ఉన్నవని ఒక వృద్ధుడు నాతో చెప్పాడు. ఆ గ్రంథం ఇంద్రజాలిక పర్వతాల్లోని ఒకానొక గుహలో వున్నదనికూడా చెప్పాడు.

అనేక కష్టాలకూ, ఎంతో శ్రమకూ ఓర్చి ఒకనాడు ఆ గుహ చేరాను. గాలీ, వెలుగూ

మరణించినట్టేనా?" అని ప్రశ్నించాడు. "చచ్చినట్టే' అన్నారు రాజులు. "జీవరహితమైనట్టే" అన్నారు పండితులు.

రాజాజ్ఞప్రకారం సేవకుడు కోడిపుంజు మొండాన్నీ తలనూ సభాస్థలానికి అవైపునా యీవైపునా వుంచాడు. సర్వజ్ఞపాలుడు జీవంలేని ఆ కోడిపుంజు మొండాన్ని వుద్దేశించి "నువ్వు పోయి నీతలను ఎప్పటిలా తగిలించుకో" అన్నాడు.

ఆశ్చర్యం! కోడిపుంజు మొండెం సభాస్థలికి అడ్డంగా నడుస్తూపోయి ఆ తలదగ్గిర మెడ వంచింది. తల మొండెంతో కలిసిపోయింది. మరు నిమిషానికి లేచినిలబడి,

లేని ఆ గుహలో గుండె చిక్కబట్టుకుని కొంతదూరం పోగా, హఠాత్తుగా ఒక పెద్ద వెలుగు నాకంటబడింది. నా శ్రమ తీరిందనీ, ఆశలు ఫలించినవనీ నాకెంతో వుత్సాహం కలిగింది. తడబడుతూ ఆ వెలుగును సమీపించాను.

ఆ వెలుగు ఒక నలుచదరపు గాజుపెట్టె లోనుంచి వస్తూన్నట్టు మొదట్లో నాకు తోచింది. కాని బాగా పరీక్షించి చూడగా దానికి కారణం, ఆ గాజుపెట్టె మధ్యన వున్న ఒక పెద్ద గ్రంథమని గ్రహించాను. అతృతతో ఆ పెట్టెపై చేయివేశాను.

అదే సమయంలో నాకు ఎదురుగా కొంచెందూరంలో నల్లని వికృతాకారం కారుమేఘంలా కదలటం చూచాను. మరు క్షణంలో వికృతమైన ధ్వని వినిపించింది.

"ఏయ్! ఎవడవు నువ్వు? బయటికి పో!" అన్న భయంకర శబ్దం నన్ను హడలకొట్టింది. నేను భయాన్ని అణిచిపెట్టి "ఈ గాజుపెట్టెలోని ఆ గ్రంథం తీసుకోకుండా బయటికి పోను" అన్నాను.

"అలానా! అహ్హహ్హ హ్హ!!" అన్న భయంకర గర్జనతోపాటు ఉరుములూ, మెరుపులూ, కడవపోతగా వానా ప్రారంభమయినై.



భయంతో నేను వణికిపోయాను. దుష్ట శక్తులనుంచి రక్షణ చేసుకునేందుకు, చిన్ననాడు ఒక సిద్ధుడిద్వారా తెలుసుకున్న మంత్రాన్ని పెద్దగా ఉచ్చరింపసాగాను.

పదినిమిషాల్లో వాన వెలిసింది. ఉరుములూ, మెరుపులూ తొలగిపోయినై. ఆ క్షణంలో కలిగిన సాహసంతో, గాజుపెట్టెను బలంగా గ్రుద్దేసరికి పెట్టె ముక్కలై పోయింది. ఆ దివ్యగ్రంథాన్ని రెండు చేతులతోనూ హృదయానికి హత్తుకుని, గుహవెలుపలికి పరుగు పెట్టాను.

నన్ను వెన్నాడుతూ, ఆ వికృతాకారం భయంకరంగా శపించసాగింది: "నువ్వు

నానుంచి తప్పుకోలేవు. నీకు పగలు విశ్రాంతీ, రాత్రి నిద్రా లేకుండా చేస్తా. జాగ్రత్త!" అన్నది.

అలానే జరిగింది. నాలుగు దీర్ఘవత్సరాలు ఆ గ్రంథం నేను పఠించాను. ఎన్నెన్నో అద్భుత శక్తులను దానిద్వారా పొందగలిగాను. కాని నేను అందుకుగాను చెల్లించిన మూల్యం అపారం. నా ఆరోగ్యం, మనశ్శాంతీ నశించింది. పగలూ, రాత్రీ కూడా భయంకరమైన నరకంగా తయారైంది. ఆఖరికి ఆ అద్భుత గ్రంథాన్ని సొంతంగా పఠించకుండానే, ఆ గుహలో ఎప్పటిచోటున ఉంచేసివచ్చాను.

అయినా నాకు మనశ్శాంతి కలగకుండా ఆ భూతాత్మ నన్ను వెన్నాడుతూనే వుంది. శపిస్తూనే వుంది. నాకేమీ దారితోచలేదు.

ఒకనాడు అడిగాను : "నీ గ్రంథం నీ గుహలోనే వుంచానుగదా! ఇంకా ఎందుకు నన్నిలా బాధిస్తావు?" అని. ఆ వికృతాకారం మరింత వికృతంగా మారి బొబ్బరించింది :

"ఆ గ్రంథం చదివి నువ్వు అనేకమైన అపూర్వశక్తులు పొందావు. వాటిద్వారా లోకానికి నీనుంచి కీడుకలగవచ్చు."

"పరుల మేలుకే ఆ శక్తిని వినియోగిస్తాను. ప్రమాణపూర్తిగా చెబుతున్నాను. నమ్ము!" అన్నాను. "సరే! అమాట నువ్వు నిలుపుకొన్నంతవరకూ నీజోలికి రాను" అంటూ ఆ భయంకర రూపం నన్ను వదిలిపోయింది. ఇదీ కథ."

దర్బారంతా గుసగుసలు అవరించినై. 'పరులమేలుకోసమని మనం కోరి కీడెందుకు తెచ్చుకోవాలి! మనకు ఆ గ్రంథం అవసరమే లే' దనుకున్నారు పండితులు. 'పరరాజ్యాలని జయించేటందుకూ, ప్రజల్ని కిక్కురుమనకుండా అణచివుంచేందుకూ పనికిరాని ఈగ్రంథం మనకేమి ఉపయోగ' మనుకున్నారు రాజులు.



# చందమామ పజిల్
### (భాషాభి వృద్ధికి)

అడ్డము:

1. వెల
3. వయస్సు
5. విస్మపము
8. ధనవంతుడు
10. విష్ణువు
11. సరస్వతి
12. త్రాసు
13. కిరీటము
15. పూర్వము
17. అపజయము
19. తెలివి
20. అరుగు




నిలువు:

2. లక్ష్మి
3. దాతృత్వము
4. బాధ
6. ఆభరణము
7. ఏనుగు
9. హారతి
10. నాగలి
13. ముని
14. దారి
16. బూడిద
17. సహనము
18. హద్దు

# వినోద చదరం



దిగువను ఇచ్చిన ఆధారముల సహాయంతో ఈ క్రింది చదరంలో మీరు ఏడు మాటలు నింపాలి. సరియైన మాటలతో మీరు నింపగలిగితే అన్ని మాటలలోను చివరి రెండు అక్షరాలూ ఒకేలాంటివి వస్తాయ్. దీనిని పూర్తి చేయగలరేమో చూడండి.


మీకు తెలియకపోతే జవాబుకి
55-వ పేజీ చూడండి.


| | | | |
|---|---|---|---|
| 1. | | | |
| 2. | | | |
| 3. | | | |
| 4. | | | |
| 5. | | | |
| 6. | | | |
| 7. | | | |

ఆధారములు:

1. శరీరము
2. సిరు
3. అశ్వశాల
4. పుండు
5. వేగము
6. రాబడి
7. గెలుపు



# ఇంద్రజాలము

## పేకముక్కలతో మరొక ట్రిక్కు

చీట్లపేకలోని యాభైరెండు ముక్కల్లో ప్రేక్షకులు ఏ ముక్కను కోరుకున్నా, దాన్ని చూడకుండానే కలిపివేసి మళ్ళీ పైకి తీయటం—ప్రతి ఇంద్రజాలికుడూ చేసే పనే. ఈ గారడీకి మామూలు డిజైనుకాక, వెనుకవైపు బొమ్మలున్న పేకముక్కలు బాగా ఉపయోగపడతాయి.

ఇలాంటి పేక ఒకటి తీసుకొచ్చి, గులాబీ పువ్వు తొడిమభాగం అడుగుకు వచ్చేట్లుగా పేక అంతా సర్ది ఉంచుకోవాలి. ఆ పేక ముక్కలు ఎదుటవైపు ప్రేక్షకులు కన్పించేట్టు విడమర్చి పట్టుకుని 'మీ కిష్టమైన ముక్కను కోరుకోండి' అని అడగాలి. ఆ ప్రేక్షకుడు తాను కోరుకున్న ముక్కను పైకి లాగుతాడు. అప్పుడు ఐంద్రజాలికుడికి ఏ ముక్కయిందీ తెలుసుకోటానికి ముందు వైపు కన్పించదు. ప్రేక్షకుడు మళ్ళీ ఆ ముక్కను ఐంద్రజాలికుడి చేతిలోని పేకలో కలిపేలోగా ఇతడు తన చేతిలోని పేకను ఎదుటివాళ్లకు తెలియకుండా తల కిందుగాచేసి పట్టుకుని ఉండాలి. ప్రేక్షకుడు ఆ ముక్కను పేకలో కలిపినప్పుడు, ఆ ముక్క ఒకటే (వెనుకభాగం) సరీగా ఉంటుంది. మిగతా పేకఅంతా తలకిందుగా ఉంటుంది. పై బొమ్మ చూడండి. గులాబీపువ్వు తొడిమ క్రిందికి ఉంది అన్ని ముక్కలలో. ప్రేక్షకుడు వాటిల్లో ఒక ముక్కను పైకితీశాడు.



ఈ క్రింది బొమ్మ చూడండి. ఇంద్రజాలికుడు ఈలోపుగా తన చేతులోఉన్న పేకను తలకిందుగా చేశాడన్నమాట. గులాబీ తొడిమలు పైకి ఉన్నాయ్. ప్రేక్షకుడు ఆ ముక్కను మళ్ళీ ఈ పేకలో చేర్చేప్పుడు తొడిమ క్రిందికి పువ్వు పైకి ఉండటం తెలుస్తూనే ఉందిగా. పేకను ఎన్నిసార్లు కలిపినా, ఆ ఒక్క ముక్క మిగతా వాటికన్నా తేడాగా కన్పిస్తూనే ఉంటుంది. కనుక వెనుకవైపు మాత్రమే చూసి, ఇంద్రజాలికుడు ఆ ముక్కను తీసి చూపగలడు. "మామూలు 'గ్రేట్ మొగల్' 'కారవాన్'



పేకలతో ఈ గారడీ ఎలాచెయ్యటం?" అని అడగవచ్చు. అలాంటప్పుడు ముందుగానే ఆ పేకను తెచ్చుకుని, ఆ డిజైన్‌క్రింద సన్నగా ఉండే మార్జిన్‌లో అన్నిముక్కలకూ ఒక వరుసలో సిరాగుర్తుపెట్టి రెడీగా ఉంచుకోవాలి. అలాచేస్తే ప్రేక్షకుడు ఆ ముక్కను పైకి లాగినప్పుడు ఇతడిచేతిలోని పేకను నేర్పుగా తలకిందు చేసినప్పుడు ఈ పేకముక్కల్లోని గుర్తులన్నీ ఒకవైపుకూ-ప్రేక్షకుడిచేతిలో ఉన్న పేకముక్కమీది గుర్తు మరొకవైపుకూ ఉంటుంది. ఆ గుర్తునుపట్టి ప్రేక్షకుడు కోరుకున్న పేకముక్కను సుళువుగా చెప్పవచ్చు.

---

పాఠకులు ఈ గారడిని గురించి యింకా వివరంగా తెలుసుకోదలిచితే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ ప్రొఫెసరుగారికి నేరుగా వ్రాయవచ్చు. మీరురాసే ఉత్తరాలు ఇంగ్లీషులోనే వుండాలి. ఇది అతి ముఖ్యం.

ప్రొఫెసరుగారి అడ్రసు యిది:—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్
12/3/A, జమీర్‌లేన్, బాలీగంజ్,
కలకత్తా - 19

### ప్రొఫెసరు సర్కారు దిగ్విజయయాత్ర

మన సర్కారు యిప్పుడు దూరప్రాచ్య దేశాలలో సంచారంచేస్తున్నారు. వారి ప్రదర్శనాలకు అందరూ ఆశ్చర్యపడుతూ ఆయనకు బ్రహ్మరథం పట్టుతున్నారు. కనకవర్షం కురుస్తున్నది. ఈ పర్యటనలో వారు మలయా, జపాను, ఆస్ట్రేలియాలు దర్శిస్తారు. అయితే, సర్కారు ఎక్కడవున్నా చందమామ పాఠకులకు వారు తమ ట్రిక్కులు ఎప్పటిలా అందజేస్తూనే వుంటారు.

# అట్టమీదిబొమ్మ

శిశుపాలుని చెలికాడు సాల్వుడు. శ్రీకృష్ణునికీ రుక్మిణికీ పరిణయం ఐననాటి నుండీ సాల్వుడికి కృష్ణునిమీద కోపంగానే వున్నది. 'కృష్ణుడినేకాదు, యాదవ కులమే నిర్మూలించివేస్తా'నని అతడు రాజులందరిమధ్యనీ ప్రతిజ్ఞచేశాడు.

ఈ ప్రతిజ్ఞ నెరవేర్చుకునే తలంపుతో సాల్వుడు, ఈశ్వరుణ్ణిగురించి ఘోర తపస్సు అరంభించాడు. అతని తపస్సుకు మెచ్చి ఈశ్వరుడు ప్రత్యక్షంకాగా,— 'సుర అసుర నర గంధర్వ ఉరగాదులకు అభేద్యమైనటువంటిదీ, కామగమనము కలదీ, ఒక విమానం కావా'లని వేడుకొన్నాడు. వెంటనే ఈశ్వరుడు విశ్వకర్మకు అజ్ఞాపించాడు. విశ్వకర్మ 'సౌభవిమాన'మనేదాన్ని సృష్టించి సాల్వుడికిఇచ్చాడు.

సౌభవిమానం వచ్చినప్పటినించీ సాల్వుడిని పట్టపగ్గాలు లేకపోయినై. దానిపైన ఎత్తివెళ్లి ద్వారకను ముట్టడించి ధ్వంసం చేయసాగాడు. విమానంపైనుండి శిలావర్షం కురిపించి, ప్రజకు క్షోభకలిగిస్తూవచ్చాడు. అప్పుడు, వాడి దుర్నయాలను అణిచివేయాలని తలిచి ప్రద్యుమ్నుడు యుద్ధానికి తలపడ్డాడు. ఐతే— సాల్వుడు తన విమానాన్ని బహురూపాలుగా తిప్పి, దాగుకొనీ—పైకివచ్చీ— భూమితాకీ — కొండలపైకిపోయీ — అనేకమాయలు అగపరుస్తూ చిక్కులు పెట్టాడు. ప్రద్యుమ్నుణ్ణి మూర్ఛకూడా పోగొట్టాడు.. ప్రద్యుమ్నుడు తేరుకొని అతి పౌరుషంతో ఇరవైఏడురోజులు యుద్ధంసాగించి, చాలవరకు సాల్వుని సేననూ, ముఖ్యనాయకులనూ పరిమార్చాడు.

ఇంతలో—ధర్మరాజు చేసే రాజసూయయాగానికి వెళ్లిన శ్రీకృష్ణుడు తిరిగి వస్తున్నాడు. అతడు బయల్దేరేసరికి దుశ్శకునాలు కనబడినై. సరి, సాల్వుని సమాచారం తెలుసుకుని, యుద్ధరంగానికి చేరుకొన్నాడు. ఊరకున్నకొద్దీ సాల్వుని దుండగాలు మితిమీరిపోవటంచూచి, శ్రీకృష్ణుడు సాల్వుని తాకి, సౌభవిమానాన్ని నూరుముక్కలుగా నరికి, బాణాలతో కొట్టగా మేఘాలు ఆవరించినై. ఆ చీకటిలో నుండి సాల్వుడు సూర్యబింబంలాగా ఇవతలికివచ్చి కృష్ణుణ్ణి దూషింపసాగాడు. అప్పుడు భగవానుడు గదయెత్తి మూపులసందున వేసేటప్పటికి వాడు నెత్తురు గ్రక్కుకొని చచ్చిపోయాడు.

# ఒంటిగీత బొమ్మ



పంపినవారు : కె. ఆర్ముగం - సింహళం

# రంగుల బొమ్మ కథ—2-వ బొమ్మ

కొమ్మ నరకటానికని చాంగ్ కత్తితో ఒక్క పెట్టు పెట్టాడు. దెబ్బ పడీ పడటంతోటే చెట్టులోంచి ఒక చిత్రమైన మూలుగు వినిపించింది. చాంగ్ ఆశ్చర్యపోయి ఆ మూలుగు ఎక్కడనుండి వచ్చిందా అని చుట్టూ పరిశీలించిచూచాడు. కాని ఏమీ కనుపించలేదు. భ్రమపడ్డానేమోననుకొని, ఆ నరికినకొమ్మతో తిరిగి యిల్లు చేరుకున్నాడు.

ఆ రోజే ప్రారంభించాడు, దానిపైన బొమ్మచెక్కటం. తన చాకచక్యమంతా వినియోగించి, ఒక వారానికల్లా ఒక వృద్ధునిబొమ్మ తయారుచేశాడు. అయితే, తీరా బొమ్మ పూర్తిఅయి, దాని అందంచూసేసరికి చాంగ్ మనస్సు పరిపరివిధాల పోయింది. తను ఇన్నిఏళ్ళుగా చెక్కుతున్న బొమ్మపిడులన్నీ ఈ క్రొత్తపిడి ముందు పనికిరావనిపించింది. ఇంతా కష్టపడి, జీవంతో ఉట్టిపడే ఈ వృద్ధుని బొమ్మను ఏదో ఒకపిడికి తగిలించితే, తనతల్లి నిమిషంలో దానిని అమ్మివేస్తుందే. ఏమిచెయ్యటం ?

చాంగ్ తీవ్రంగా ఆలోచించాడు. మరునాడే ఈ పిడినికూడా ఒక గొడుగుకు తగిలించి తల్లికిచ్చాడు. అయితే, దానిని ఇవ్వబోయేముందు తల్లిని ఒక్కకోరిక కోరాడు : "ఈపిడి పట్టుకునేందుకు సామాన్యులకు అర్హతలేదు. ఈ పిడితో వున్న గొడుగు మహారాజుల హస్తాలలో వుండవలసిందే. కనుక అలాంటి వ్యక్తిని చూచి మరీ ఈగొడుగు విక్రయించు. ఇదే నాకోరిక" అన్నాడు.

ఎప్పుడైతే ఆమె దుకాణంలో ఈ గొడుగు పెట్టిందో, అప్పటినుంచీ వచ్చిన వాళ్లంతా ఆ గొడుగే కావాలని పట్టుబట్టేవారు. కాని, వాళ్ళు యిచ్చుకోలేనంత ధర చెప్పేది చాంగ్ తల్లి. ధర చెప్పటంతోనే "అమ్మబాబో, ఈ గొడుగేమిటి! మనం కొనేదేమిటి, తలకు మించినపని!" అని అనుకొని ఆవచ్చినవాళ్ళు దానిని మానేసి మరొకగొడుగు కొనుక్కొని పోతుండేవారు. ఈ పరిస్థితులలో గొడుగు విడుదలకావటానికి సావకాశమేది? అందుచేత అది అమ్ముడుకాక దుకాణంలో అలానే ఉండిపోయింది. ఐతేమరి, ఈ గొడుగు సంగతి యేమిజరిగిందీ వచ్చేనెల బొమ్మతోసహ చదవండి.

49-వ పేజీలోని

పజిలుకి జవాబు :

| | 1 ధ | 2 ర | | 3 ఈ | డు | |
|---|---|---|---|---|---|---|
| 4 వ్య | | 5 మ | 6 న | వి | | 7 క |
| 8 ధ | 9 వి | | గ | | 10 హ | రి |
| | 11 వా | ణి | | 12 తు | ల | |
| 13 మౌ | ళి | | 14 బా | | 15 ము | 16 సు |
| వి | | 17 ఓ | ట | 18 మి | | సి |
| | 19 నే | ర్పు | | 20 లి | స్నె | |

49-వ పేజీలోని

వినోద చదరానికి జవాబు :

| | | | |
|---|---|---|---|
| 1. | కా | య | ము |
| 2. | తో | య | ము |
| 3. | లా | య | ము |
| 4. | గా | య | ము |
| 5. | ర | య | ము |
| 6. | అ | య | ము |
| 7. | జ | య | ము |




విజయ వారి

# పెళ్ళిచేసిచూడు



దర్శకుడు.... ప్రసాద్ • నిర్మాతలు.....నాగిరెడ్డి • చక్రపాణి

Controlling Editor : SRI CHAKRAPANI
Printed and Published by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras





Photo by A. L. Syed

తగ్గులు

